# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక



ANDHRA PATRIKA

25 నయాపైసలు

| సంవత్సర చందా<br>రు. 13-0-0<br>విడిప్రతిక 25న.పై. | # ఆంధ్రపత్రిక<br>సచిత్రవారపత్రిక<br>**Founder : K. NAGESWARA RAO** | సంపుటము 51<br>సంచిక 40<br>5-6-57 |
|---|---|---|

హేవిళంబి జ్యేష్ఠ బహుళ అష్టమి బుధవారం


## విషయానుక్రమణిక




## ★ హాంకాంగ్ శరణార్థుల సమస్య ★

> ఆంధ్రపత్రిక ఢిల్లీ ప్రతినిధి శ్రీ కృష్ణ విదేశాలలో పర్యటనచేస్తున్న విషయం పాఠకులకు తెలిసిందే. వారు ఇటీవల హాంకాంగ్ దర్శించి, అక్కడినుంచి జపాన్ చేరుకున్నారు. లక్షలాది శరణార్థుల పునరావాస సమస్యను హాంకాంగ్ ప్రభుత్వం ఏవిధంగా పరిష్కరించిందో ఇక్కడ వివరించారు. వివిధదేశాలలో వారిఅనుభవాలపై వ్రాసే వ్యాసాలను సచిత్ర వారపత్రికలో 'యాత్రావిశేషాలు' అనే శీర్షిక క్రింద పాఠకులకు అందజేస్తుంటాము.
>
> — శ్రీ కృష్ణ —

పొరుగింటి పుల్లకూర రుచీ అన్నారు. ఇదే విధంగా ఇరుగుపొరుగువారి పెరళ్లలో పూసే పూవులంటే కూడా కొందరికి మహా ఇష్టం. ఇదివరలో భారత వైస్రాయిగా పనిచేసిన లార్డ్ వేవెల్ "పొరుగింటి పూలు" అనే గ్రంథం వ్రాశాడు. ఇది చాలా ప్రసిద్ధ గ్రంథం. ఇదేవిధంగా "ఇతరుల ఖర్చుమీద" ప్రపంచ పర్యటన చేయడమంటే నాకూ సరదే. అయితే ఇక్కడ 'ఇతరులు' అంటే భారతీయులు చేరరనుకోండి.

నేను న్యూఢిల్లీనుంచి రైలులో బయలుదేరినప్పుడు దేశవ్యాప్తంగా పెద్దపెట్టున రైల్వే సప్తాహ మహోత్సవాలు జరుగుతున్నవి. అదేం ఖర్మమో, నేనెప్పుడు మనదేశపు రైళ్లలో ప్రయాణం చేయబోయినా ఒక మనిషి మరో మనిషిని ఎంత ఘోరంగానైనా హింసించగలడని ప్రఖ్యాత ఆంగ్లకవి వర్డ్స్ వర్త్ చెప్పిన సూక్తి తప్పక జ్ఞాపకం వస్తుంది. భారతీయులు భారతీయ రైళ్లను ఎన్ని అగచాట్లకు పాల్పడచేశారోకదా అనిపిస్తుంది. కుల, వర్గరహిత సమాజాన్ని నిర్మించడం భారతీయుల మహత్తర లక్ష్యం! ఈ లక్ష్యంతోలూకు మొదటి సమ్మెటపెట్టు దేశంలోని రైలుమార్గాలమీదే పడ్డదేమో ననిపిస్తుంది. నవసమాజ నిర్మాతలు తమ మహోన్నత లక్ష్యాలనుగురించి గొప్పగా చెప్పుకోవడమేగాని, ఆరోజుకారోజు కుల వర్గ మత ధోరణి దేశంలో మరీ పాతుకుపోతున్నది. రైల్వేలలోమాత్రం వాటిధోరణే మారిపోతున్నది. భారత రాజధానిలో కొంతమంది పత్రికాప్రతినిధులు తమ తమ లెటర్ హెడ్ పేపర్లద్వారా చెలామణీ అయినట్లు, రైళ్లలో తరగతులు కూడా వాటికి అంటించిన నంబరు ప్లేట్లతో చెలామణీ అవుతున్నవి. ఆ ప్లేట్ల సహాయంవల్ల ఏ రైలుపెట్టె ఏ తరగతిదైందీ గుర్తుపట్టడానికి వీలవుతున్నది. మొదటితరగతి పెట్టె అని చెప్పడమేగాని, దాని బండారం పైకి పటారం లోపల లొటారమే. స్వాతంత్ర్యావతరణకు పూర్వమున్న మొదటి తరగతికీ, ఇప్పటి మొదటి తరగతికీ ఎక్కడా పోలికే కనపడదు. ఆ మాటకు వస్తే, అప్పటి రెండవతరగతికి కూడా ఈనాటి మొదటి తరగతి సరితూగదు. తాము సాధించిన ఘనకార్యానికి రైల్వేబోర్డు ఏమన్నా గర్విస్తుందేమోగాని, మిగతావారెవరూ ఈ మార్పులను హర్షించరు. పాతకాలపు మొదటి తరగతి రైలుపెట్టెలో వున్న సుఖం లేదు సరికదా, పరిశుభ్రత కూడా ఏకోశానా కనబడదు. దీన్ని మొదటి తరగతి అని వ్యవహరిస్తే, 'మొదటి తరగతి' అనే

# ★ యాత్రావిశేషాలు ★

మాటలకు అర్థమైనా పోయివుండాలి, లేక, మనలో హేతువాదబలమైనా లోపించాలి. ప్రపంచ యాత్రికులు మనదేశానికి రావాలి, వివిధ విచిత్ర ప్రదేశాలనూ చూడాలి అని మనం బహు విరివిగా చేస్తున్న ప్రచార పర్యవసానమేమిటో అంటే, ఎర్ కండిషన్డ్ పెట్టెలలోకూడా పరుపులమీద మెత్తటి బొంబాయి మిల్లుగుడ్డ స్థానే, శుద్ధ మురికిఖద్దరు గుడ్డను వాడుడమే.

కొన్నూరులో నేను ఆరుగంటలసేపు ఆగిపోవలసివచ్చింది. కొన్నూరు రైలు స్టేషన్ సప్తాహోత్సవ సందర్భంలో రంగు రంగుల విద్యుద్దీపకాంతులతో దేదీప్యమానంగా వెలిగిపోతున్నది. ఎక్కడ చూసినా విద్యుద్దీపతోరణాలే.

మొదటి తరగతి ప్రయాణీకుల వెయిటింగు రూములో స్నానాలగదులు నానా అంకఖండాలంగానూ వున్నవి. వాటి దుర్భర పరిస్థితులు వర్ణింప శక్యం కాదు. తొమ్మిది రూపాయలు అద్దె చెల్లించి ఏర్పాటు చేసుకున్న గదులలో పక్క దుప్పట్లు బదాబదలుగా చిరిగిపోయి వున్నవంటే నమ్మండి! పాకీదొడ్లలో వున్న కొళాయిలలో నీళ్ళు ఏకధారగా కారిపోతూనే వున్నవి. ఆ గది అంతా జలమయం. దాన్ని ఎవరూ కొన్ని నెలలపర్యంతం శుభ్రంచేసిన పాపాన పోయినట్టు కనబడదు. ఇది లోపలిస్థితి! ఇక పైకిచూస్తే, రైల్వే స్టేషన్ తాజ్ మహల్‌లా శోభిస్తున్నది! అందుకే పైకి పటారం, లోపల లొటారం' అన్నాను. పైకి ఢళఢళలు, లోపల లుకలుకలు! రైల్వే సప్తాహోత్సవాలని పేరుపెట్టి ప్రజాధనం దుర్వినియోగంచేయడంలో అంతరార్థమేటిలో వేరే చెప్పవలసినపని లేదనుకుంటాను. డబ్బును ఎందుకు గుండ్రంగా తయారుచేశారంటారు బండి చక్రాలలా దరదరా దొర్లిపోవడానికి కాకపోతే? ఆ ఖర్చుచేసేడబ్బు సొంతం కాకపోతే, ఇహ చెప్పారు? మంచినీళ్ళ ప్రాయంగా ఖర్చుచేసెయ్యొచ్చు. ధన దుర్వినియోగం విషయంలో ప్రజలనే మభ్యపెడుతున్న ఈ రోజులలో కొన్నూరు రైల్వే స్టేషన్ దుస్థితినిగురించి స్టేషన్ సూపర్నెంటును ఏమని ఏమి ప్రయోజనం? స్టేషన్ దాని పరిశుభ్రత అన్నవి అతడిదృష్టిలో బహుస్వల్పవిషయాలు! రైల్వే సప్తాహ మహోత్సవాలలాంటి పెద్దపెద్దపనులతో మునగానాం తేలానాం అవుతున్న ఆయన ఈ స్వల్ప విషయంపట్ల శ్రద్ధ వహిస్తాడని మనం భావిస్తే ప్రయోజనమేముంటుంది?

* * *

ఆంగ్లేయులు ఎక్కడ వుంటే అక్కడే ఒక 'చిన్న ఇంగ్లండు' సృష్టించుకుంటారని ఇదివరకే ఒకానొక సందర్భంలో మనవి చేశాను. హాంకాంగ్ బ్రిటిష్ వలసదివి. భారతదేశ స్వాతంత్ర్యావతరణకు ముందు కలకత్తానగరం ఎలావుండేదో, ఈ హాంకాంగ్ అలా వుంటుంది. ఇక్కడి పోలీసుబలగం బహు సామర్థ్యంతో పని చేస్తుంటుంది. 1939కి పూర్వం ఈబలగంలో కొంతమంది మనదేశపు సర్దార్జీలుకూడా పని చేస్తుండేవారు.

హాంకాంగ్ అతిమనోహరమైన ద్వీపం. దాని పారిశుద్ధ్యాన్నీ, సౌందర్యాన్నీ కాపాడడంలో పరిపాలకులు ఎంతో శ్రద్ధ వహిస్తుంటారు. భౌగోళికంగా ఈ దీవి ఉనికినిబట్టి చూస్తే కమ్యూనిస్టు చైనాకు గవాక్షంలాంటిదని వర్ణించవచ్చు. పెకింగ్ ప్రభుత్వం దీని విషయమై చూసీ చూడనట్లున్నది కాబట్టే, ఈ దీవి బ్రిటిష్ వలసగా నిలవగలుగుతున్నది. ఇంతేకాకుండా, ఇది అతిబలీయమైన కమ్యూనిస్టువ్యతిరేక స్థావరాలలో ఒకటి. స్వేచ్ఛగా బ్రతకనిచ్చినట్లయితే, ప్రతి చైనా శ్రామికుడూ, హాంకాంగ్ మురికి కూపాలలోనూ, చీకటి కోణాలలోనూ వుండడానికే సాఇష్ట పడతాడుగాని, శ్రామికజనం పాలిటి స్వర్గమనిచెప్పే చైనా ప్రధాన భూభాగంలో నివసించడానికి ఇష్టపడడని చెప్పడానికే హాంకాంగ్ ఒక ప్రబల నిదర్శనం. అక్కడి చైనా శ్రామికులకు నేటి చైనా అంటే అంత అసహ్యం. కమ్యూనిస్టు వ్యతిరేక స్థావరమైన హాంకాంగ్‌ను పెకింగ్ ప్రభుత్వం ఎందుకు సహించి వూరుకుంటున్నదనే ప్రశ్న రావడం సహజం. విదేశాలలో స్థిరనివాసాలు ఏర్పరచుకొనివున్న చైనావారు సాలీనా కొన్ని కోట్ల పౌనుల విలువగల విదేశీ ధనాన్ని హాంకాంగ్ ద్వారా మాతృదేశంలో వున్న వారికి పంపిస్తుండడమే దీనికి ముఖ్యకారణాలలో ఒకటి.

శరణార్థుల పునరావాస సమస్యతో సతమతమవుతున్న భారత ప్రభుత్వం ఇదే విధమైన సమస్యను పరిష్కరించడంలో హాంకాంగ్‌పాలకులు ఎంతటి చాకచక్యం ప్రదర్శించారో, తెలుసుకుంటే ఆశ్చర్యపడక మానదు. మూడేళ్ళ క్రితం హాంకాంగ్‌కు శరణార్థులు తండోపతండాలుగా లక్షలకొద్దీ వచ్చి ఎక్కడబడితే అక్కడే తిష్ఠవేశారు. వీరందరూ చైనా నుంచి వచ్చినవారే. ఇప్పటికే దాదాపు 8 లక్షల 30 వేల మందికి తల దాచుకోడానికి చోటు చూపించవలసి వున్నది. మరొక మూడు లక్షలమంది ఇప్పటికీ జనంతో కిటకిటలాడుతున్న నివాసాలలో కాలం గడుపుతున్నారు. వీరి సంగతి ఇలావుండగా, 1956 లో చైనానుంచే మరొక 60 వేల మంది ఒక పెద్ద తండాగా వచ్చి పడ్డారు. 1956 లోనే ద్వీపం మొత్తం మీద మరణాలసంఖ్య కంటే జననాలసంఖ్య 75 వేలు హెచ్చు. అంచేత హాంకాంగ్ ప్రజలకు గృహసమస్య అతిక్లిష్టమైన ప్రధాన సమస్యగా తయారైంది. మొత్తం 891 చదరపుమైళ్ళ విస్తీర్ణంగల భూభాగంలోనూ నివేశన స్థలాలకు వెంటనే ఉపయోగపడేది 62 చదరపుమైళ్ళ మేర మాత్రమే. ఈస్వల్ప విస్తీర్ణాన్ని ఉపయోగించి మొత్తం 25 లక్షల మందికి హాంకాంగ్ పాలకులు నెలవు చూపించవలసి వచ్చింది; వీరుగాక జననమరణాల రిజిస్టర్ల ప్రకారం ప్రతి సాలుకూ అదనంగా పెరుగుతున్న 75 వేల మంది సంగతి సరేసరి.

భారతదేశంలో ఏర్పడిన శరణార్థుల

(10-వ పేజీ చూడండి)




## క్షేమం

చి॥ బుడుగూకు ఆశీర్వాదాలు. నీవు, నీ గానపెసూనాంబ కులాసాగా యున్నారని తలంచుచున్నాను. నీ చదువు ఎంతదాకా వచ్చింది. రిజల్ట్సు చెప్పినారా? నీకు అన్నింటిలో ఎన్ని మార్కులు వచ్చాయి? ఇచ్చట మా అన్నయ్య, తమ్ముడు, నేను, మా అమ్మ, నాన్న, కులాసాగా వున్నాము. నీవు తప్పకుండా పత్రికలద్వారా నీ క్షేమ సమాచారాలు తెలుపుతూ వుండగోరుతాను. అప్పుడప్పుడు జాబులు వ్రాస్తూవుండు.

నీ స్నేహితుడు.
ఎం. గురుప్రసాదరావు,
(ఆదోని).

* * *

నేను 'బుడుగు చిచ్చులపిడుగు' శీర్షికను చదివి ఆనందించే అసంఖ్యాక పాఠకుల్లో ఒకణ్ణి. ఆ శీర్షిక ఎంత బాగుంటుందో చెప్పలేను.

రఘోబాకుమార్,
(అనంతపురం).

* *

డియర్ బుడుగూ,
ఇదివరకు నువ్వు కనిపిస్తే ఎంతో సంతోషముగా ఉండేది. ఇప్పుడు నీవు మళ్లీ ఎప్పుడు కనిపిస్తావు అని నేను అనుకుంటున్నాను. వేసంగి సెలవు లైపోయినాక నువ్వు వస్తావా? అలాంటప్పుడు ముందస్తుగా చెప్పిరాకు. మేము ఆశ్చర్యపడేటట్లు ఒక్కసారి రా. మరి మీ సెలవు లెప్పుడైపోతాయి.

మురళీధర్,
(చీరాల).

వురేయ్ బుడుగూ!
వురేయ్ అనేస్తున్నా రెవరా అని ఆశ్చర్యపడిపోయేస్తున్నావా? సరే. నా నిఝంపేరు తీగవరపు రామకృష్ణారావు లేపో, మాద్రోలకో మనిద్దరం ఫ్రెండిస్మై పోతాంగదూ! అందుకని ముందస్తుగానే వురేయ్ అని పిలుస్తున్నాలే! నీ ఖదలన్నీ చదివింతర్వాత నాగ్గూడా ఒక "సీగానపెసూనాంబ" వుంటే బావుణ్ణనిపించింది. అందుకని నాన్నని వెంటనే అడిగేశాను. వాడున్నాడు చూశావ్, వాడు కోపంతో ఖులాయ్ వెధవా, నీకిప్పణ్ణించే "సీ గానపెసూనాంబలు" కావాలా? ఇలా అయితే నీవు నిఝంకెట్కా తోలుకోవాల్సివస్తుంది' అని గాఠిగా అనేశాడు.

(చింతలపూడి)

* * *

డియర్ బుడుగు, నీ ప్రియమైన అక్కాయ్ కృష్ణకుమారి వ్రాయడమేమనగ నీ ఖదలు నాకు చాలాయిష్టం. నిఝంగా చెప్తున్నాను.

ఒక రోజేమో మా కాలేజి ఫ్రెండిస్ ఇంటికి పోతే "ఏమేవ్ కృష్ణా బుడుగు ఖదలు ఆంధ్రపత్రికలో వెయ్యడంలేదు. నే నేమో, మొట్టమొదట బుడుగుఖదలే చదివేదాన్నికాను. ఒకరోజు ప్రొద్దుపోక ఒక ఆంధ్రపత్రిక తెరిచాను. దాంట్లో బుడుగు సీగానపెసూనాంబను చూచి ప్రాణాలగదినుండి చాట అడ్డు పెట్టుకొని పోతున్నట్లు చూశాను. అది చదవాలనిపించింది. చదివాను. చాలబాగుంది. బుడుగు ఖథలన్నీ వరుసగా ఉండే పత్రికలు కట్టగాపంపు మళ్ళీ పంపేస్తాను"అన్నది. సరేనని పంపిస్తే ఏంచేసిందో తెలుసా బుడుగూ! నీకథలన్నీ కత్తిరించుకొని వట్టిపత్రికలు పంపింది. నేను మరల దాంతో దెబ్బలాడి తెచ్చుకొన్నాను. మా ఇంటికి నీలాంటి బుడుగులూ, సీగానపెసూనాంబలు బోల్డుమందివస్తారు. వాళ్లు నీఖదలు విన్నదే పదిమార్లు అడిగి వింటారు. బజ్జోనేముందు, బువ్వతినేముందు వాళ్లకి నీ ఖదలు చెప్పాలి. నిఝంనిఝంగా చూచినప్పుడెల్లా నీవు మాకళ్లముందు మెదుల్తూ ఉంటావు. నీవు మద్రాసుకు వచ్చినపుడు నాకు 'ఉంగా' బావ, వచ్చి బావ సేర్పాలిసుమా! నీవు వచ్చేటప్పుడు సీగానపెసూనాంబ, రాధా గోపాళాన్ని పిల్చుకొనిరా. పాపం బుడుగు నీకు బలేకష్టాలుకదూ! రైలుబండిలో పిన్నిలాంటి వాళ్ళను ఎంతమందిని రక్షించావు? నీది ఘుట్టిబుఱ్ఱ బుడుగు. మా బస్సులో మీ బాబాయిలాంటివారు, మీ ఇంటికి వచ్చిన డిటెక్టివ్లాంటి దొంగలు అనేకమందిఉంటారు. వాళ్లకు ప్రయివేటు చెప్పేవి మాలాంటి వాళ్లను రక్షించే నీలాంటి బుడుగులు లేరని విచారంగా ఉంది. మా కాలేజీ ఇంక సెప్రోజుల్లో తెరుస్తారు. మీ బాబాయిలాంటి వాళ్లను, డిటెక్టివ్లాంటి వాళ్లను డిటెక్టివ్ చేసి వాళ్లకు ప్రయివేటు చెప్పి వాళ్లచే అనుమానం పొందుతున్న మమ్మల్ని రక్షించడానికి వస్తావుకదూ!

మీ అక్కాయ్
సి. కె. కృష్ణకుమారి,
(మద్రాసు).

* * *



మహా కష్టనిష్ఠురాలతో కూడుకున్న సంసార యాత్రలో అంతా వెన్నెల కాదు; కాని, అంతా చీకటి కాదు. మబ్బులలోనుంచి మెరపుల్లాగ మన ప్రయత్నం లేకుండా కొన్నీ, చేతిదీపాలలాగ మనం తెచ్చిపెట్టుకునేవి కొన్నీ సంఘటనలు మన కళ్లకి వెలుతురూ, మనసుకి సంతోషమూ కలిగిస్తాయి. అల్లా మనం తెచ్చిపెట్టుకునే వాటిలో చెయ్యాలనిచేసే గడుసుతనపు పనులు, ఆడాలని ఆడే చమత్కారపు మాటలూ చేరతవి. అయితే, సాంసారిక జీవితంలో అందరివిషయమై ఇవి ప్రయోగం చెయ్యకూడదు. వావీ, వరసా ఒప్పుకుంటేనే ప్రయోగించాలి. వీలయిన వరుసలలో భార్యాభర్తలది మొట్టమొదటిది. ఆ వరసనుబట్టే శాస్త్రప్రకారం తనకుగల హక్కుల చలామణిలో శ్రీకృష్ణుణ్ణి నెత్తిమీద ఒక్క తన్ను తన్నింది సత్యభామ. భార్యాభర్తల వరసను బట్టే మిగతా వావివరసలు ఏర్పడ్డాయి. భర్తవైపువారు, భార్యవైపువారు ఒకళ్ల విషయంలో ఒకళ్ళు ఎన్ని చమత్కారాలైనా నడిపించుకోవచ్చును. ఎంత హాస్యమైనా చేయవచ్చును. బావా, మరదీ, వదినే మరదలూ వరుసలాడుకోవచ్చును. ఇల్లా వరుసలాడుకునేందుకు వీలయినవాళ్ళలో వియ్యపురాళ్లది ప్రత్యేకస్థానం ... "ఓహో వియ్యపురాలా!" అంటేనే హేళన. వియ్యపురాళ్లు అయినవాళ్లు కొన్ని పనులు చేయాలి; ఒక విధంగా మాట్లాడాలి; సంచరించాలి. అందులో కొంతదౌర్జన్యం కనబడుతుందిగాని, అందుకు ఎవ్వరూ తప్పుపట్టరు సరిగదా, అల్లా నడుచుకోని, తన వియ్యపురాలితనం చలాయించని వియ్యపురాలు వట్టి ఒద్దమ్మ అనీ, చచ్చుపెద్దమ్మ అనీ అనిపించుకుంటుంది. ఉద్దిలయిన ఇద్దరు వియ్యపురాళ్లు తటస్థపడి వాళ్ళకు వాదవివాదాలు వచ్చినప్పుడు ఆ ఆటఅయిపోయి, ఫలితం అనిశ్చితం అవుతుంది. కొన్ని సన్నివేశాలలో గెలుపు నిర్ణయించడం అంతర్జాతీయ న్యాయస్థానానికి విడిచిపెట్టవలసి వుంటుంది. ఈ పోటాపోటీలలో విశేషం ఏమిటంటే, నిజమయినదేదో




తెచ్చిపెట్టుకున్నదేదో నిర్ణయించడం కష్టం. ఆ వివాదం కాస్తా అయిపోగానే పోటీదార్లు ఏం వదినే అంటే ఏం వదినా అని మళ్ళీ కలిసిపోతారు. వెంటనే కలియకపోయినా, మనమడో మనమరాలో పుట్టిన తర్వాత కలిసి తీరుతారు. ఆ నిసుగు ఉభయులకీ ఉమ్మడిసొత్తు కదా!

అల్లా కలుస్తారు కనుకనే, వాళ్లు ఎంత గట్టిగా పోట్లాడుకున్నా ప్రక్కవాళ్లు నవ్వుకుని ఆనందిస్తారు; ఆ వియ్యపురాళ్లూ నవ్వుకుని ఆనందిస్తారు. వియ్యపురాళ్లంటే పాముముంగిసల్లాగా సహజ విరోధం కనపర్చాలి. నవ్వుతూ, నాజూకుగా ఎత్తిపొడుచుకోవాలి. సూదులలాంటి మాటలు ఉపయోగించుకోవాలి. గొంతెత్తి పోట్లాడుకోవాలి. ముఖం కండలు చీల్చుకొని తిట్టుకోవాలి. వరుసలకి వియ్యపురాళ్లనుకోడం ఎల్లా ఉన్నా, అసలు వియ్యపురాలన్నది వివాహసంబంధం వున్నచోట చెల్లదగిన మాట. వివాహప్రసక్తిలో, అతిముఖ్యమయిన ఘట్టం వియ్యపురాళ్ళది.

సరిఅయిన వివాహానికి మూలం వియ్యపురాండ్రువియ్యపురాండ్రుఅన్న పాత్రలుఉంటేనేగాని, (పెళ్ళిఉంటుందిగాని) వియ్యం ఉండదు; వియ్యంలేకపోతే ఏవేడుకా ఉండదు; ఏవినోదంఉండదు; ఆపెళ్ళిరాణించదు. రెండువైపులా వియ్యంకులు మాత్రం ఉండి జరిగే పెళ్ళి ఉప్పులేని పప్పులాగా చప్పగా ఊరుకుంటుంది. దున్నపోతుల బండిలాగ ఈదురోమంటూ నడుస్తుంది. వియ్యపురాళ్ళూ అంటే అటు పెళ్ళికొడుకుతల్లీ, ఇటు పెళ్ళికూతురుతల్లీని. కాని వియ్యపురాలు అని ఏకవచన ప్రయోగంచేస్తే పెళ్లికుమారుడితల్లి అనిమాత్రం ధ్వని. ఈ రెండు తరగతుల వియ్యపురాళ్ళలో కుడి ఎడమ తేడా ఉన్నది. పెళ్లికొడుకు తల్లి పైచేతి వియ్యపురాలు. పెళ్లికూతురి తల్లిది క్రింది చేయి. లోకవ్యవహారంలో ఇచ్చేవాడికి పుచ్చుకునేవాడు లోకువ. ఇక్కడమాత్రం పిల్లనిచ్చినవారు పుచ్చుకొన్నవారికి లోకువ.

నిజంగా పరిశీలించితే, క్రిందిచేతి వియ్యపురాలు లేనిది వియ్యమే సాగదు. ఆవిడ

కొన్ని సంవత్సరాలపాటు పోరగా, పోరగా పిల్ల తండ్రి సంబంధాలు వెతుకుతాడు. అవి ఆవిడకు నచ్చవు ఆవిడకి నచ్చినవి ఆయన తేడు; నేలేదుకూడాను ఈ విషయంలో పెళ్లికూతురూ, తల్లీ ఒక్కమాట మీద, ఒక్కత్రాటిమీద ఉంటారు. ఆయన తనకు కలిసిన సంబంధమనో, కొస్త కట్నం సులువనో, చేలోకువ కుర్రవాడనో ఆలోచిస్తుంటారు కాబోయేవియ్యపురాలికిసరిగాఅవే పనికిమాలినసంగతులు. పెళ్ళికూతుళ్ళు, తల్లి చెప్పినట్టే అక్షరాలా నడుచుకుంటూ, "నాకేమీ తెలియదు అమ్మనడుగు నాన్నా," అంటుంది. చివరికి కాబోయే వియ్యపురాలి మాటే నెగ్గుతుంది. వారానికి రెండుమాట్లయినా ఆవిడను హత్యచేసే అంత హంగామా చేసి, తననెత్తి తానే దబదబా మోదుకొని, ఆవిడ అన్నప్రకారమే చేస్తాడు పిల్లతండ్రి. పెళ్ళికొడుకువచ్చి, పెళ్ళిషరతులు నచ్చి, పెళ్లిముహూర్తం ఏర్పాటయి, మూడుముళ్లూపడి పెళ్ళితంతు అంతానడిచి, అప్పగింతలయి, పిల్లా పిల్లవాడూ వెళ్ళిపోయేదాకా ఏమిటి, ఆతర్వాతను పిల్ల పెద్దదయి, కాపురానికి వెళ్ళి తానుకూడా పిల్లలతల్లి అయిన తర్వాతకూడా ఏమిటి, ఈ వియ్యపురాలికి బాధ్యత ఉంటూనే ఉంటుంది. అవతల వియ్యంకుడూ, వియ్యపురాలూ జీవించి ఉన్నంతకాలంమాత్రం వియ్యపురాలనిపించుకుంటుంది. పిమ్మట వియ్యపురాలితనం పోయినా బాధ్యత తప్పదు. ఆమె తనువున్నంతకాలం తప్పనిబాధ్యత అది. ఆవిడకి అంతా బాధ్యతే. హక్కులు తక్కువ. కాని వియ్యపురాలు అంటే పైచేతి వియ్యపురాలనే లెక్క. "వియ్యపురాలి జీళ్ళు" అని ఒకరకం జీళ్ళు అమ్ముతారు. అవి ఆవిడను గౌరవించేందుకు తయారుచేసినవే. వియ్యపురాలి గోటు, వియ్యపురాలి బెట్టు, వియ్యపురాలి అలకా, వియ్యపురాలి గునుపూ, వియ్యపురాలి దెప్పులూ అన్నీ పైచేతి వియ్యపురాలి విలాసాలు. ఈవిడకి అన్నీ హక్కులేగాని, బాధ్యత లేదు. పెళ్ళి సంబంధం మాటలు, పెండ్లికూతురు చూపులు, వచ్చినప్పుడు ఆమె చేసే జులుము ఏహిట్లరూ చెయ్యలేదు. తనూ, తనకొడుకూ కాకిరంగయినా, బంగారంవంటి పిల్లను పట్టుకుని జీడిగింజలాగ ఉందంటుంది; రంభలాంటి పిల్లకు ముక్కువంకర అంటుంది. అబ్బాయికి సంగీతమంటే ఇష్టం; ఈపిల్లకి సంగీతం రాదంటుంది; ఆపిల్లకి చదువు రాదంటుంది; వియ్యపురాలు వంటమనిషిలా ఉందేమిటే అని ఈసడిస్తుంది. అన్నిహంగులు కుదిరినా, కట్నకానుకలదగ్గర మొండిపట్టు పట్టుకు కూర్చుంటుంది. తనకు రావలసిన లాంఛనాలను గురించి నిష్కర్షచేస్తుంది. ఆరాబడులు అనేక తరగతులు. లాంఛనాలంటారు వాటెని; వియ్యపురాలి లాంఛనాలు. ఈ లాంఛనాలు రొఖ్ఖం రూపంలో ఉంటాయి. నూటపదహార్లు రొఖ్ఖం ఆవిడకు చెల్లించవలసి వుంటుంది. పట్టుచీరెలు, పట్టురవికలు మొదలయిన లాంఛనాలుకూడా ఉన్నవి. వియ్యపురాలికివన్నీ సమర్పించేసి, ఊరుకుంటే చాలదు! మహారాణిని గౌరవించినట్లుగా ఆవిడను గౌరవించాలి. ఆడపెళ్లివారు ఆమెగారిని విడిదిలోనుంచి ఆహ్వానించి, మేళతాళాలతో వెంటపెట్టుకు తీసుకురావాలి. తీసుకువచ్చి, కాళ్లు కడుక్కోను నీళ్ళుతెచ్చి, కాళ్ళు కడిగి తడిఒత్తాలి; ఎత్తైనపీటవేసి కూర్చోపెట్టాలి. ఇందునిమిత్తం వియ్యపురాలిపీటలని ఒకదినుసు పీటలుంటాయి. అటువంటి పీటమీద ఆవిడను కూర్చోపెట్టి, వడ్డనచేయించాలి. వడ్డన ముందుగా ఆవిడికే చెయ్యాలి. ఇందులో ఏది సక్రమంగా నడవకపోయినా, ఆవిడగారికి ఆగ్రహం వచ్చి, సరాసరి విడిదిలోకి వెళ్ళిపోయి భీష్మించుకుని కూర్చుంటుంది. దీనినే వియ్యపురాలి అలక అంటారు. ఆ అలక తీరేదాకా మిగతా పెళ్ళితంతు యావత్తు ఆగిపోవలసిందే! ఆడపెళ్ళివారు పసిపిల్లబాలాది విడిదిలోకివెళ్లి, ప్రాణాచారాలు పడి, బతిమాలి, అలుకతీర్చి, ఆమెను ప్రసన్నురాలిగా చేయవలసిందేగాని, గత్యంతరం లేదు. ఒకపెళ్ళిలో ఇల్లాగ పైచేతి వియ్యపురాలు పదకొండోమారు అలిగి చక్కాపోయింది. ఆ అలుకకు కారణం లేకపోలేదు. పెళ్ళికూతురుతల్లి అంట్లతోమే దాసి ఇంకా రాలేదేమని విసుక్కుంటూ ఆదాసి నుద్దేశించి, ఈ పెళ్ళి అదనుచూచుకుని, "వెంకమ్మముండకి కళ్ళు నెత్తిమీదికొచ్చాయి," అందిట. పెళ్ళికొడుకు తల్లిగారిపేరు కూడా వెంకమ్మేనట. ఆవిడగారు ఆ తిట్టు తనకే అన్వయించుకుని, విడిదిలోకి లేచి చక్కాపోయింది. "చేసి, చేసి ప్రాణం విసిగిఉండి అల్లాఅన్నాను. మాతల్లీ.. దాసీ దాన్నన్నాను, మిమ్మల్ని అనడానికి నాకు నోరు వొప్పిందా? వదినెగారూ నా పిల్లలమీద ఒట్టు!" అని కాళ్లు పట్టుకుంది పెళ్ళికూతురి తల్లి. బంధుజనం కూడా చెప్పిచూచారు; కానీ లాభంలేకపోయింది. చివరికి ఒళ్ళుమండి, "అలిగితే అలగనీ, పొమ్మంది..." పెళ్ళికూతురు తల్లి. వీరింట వీరు, వారింట వారు. అసలు దీనిలో వాస్తవం ఏమిటి అంటే, వీరూ వారూ లోగడనుంచీ పరిచయస్థులే. పెళ్ళికూతురు తల్లినోరు మహాచెడ్డదని ఆవాడకట్టంతా తెలుసునట. తిట్లాలనే తిట్టే ఉంటుంది అనుకున్నారట విన్నవాళ్లంతా. అసలు అటువైపు వియ్యపురాలేలేని సంబంధం చూడాలనుకుందిట ఆవిడగారు. తన అదృష్టవశాత్తూ తన అత్తామామా త్వరత్వరగానే రాలిపోయినారు; పెత్తనం మొదటినుంచీ తనకేదక్కింది. అల్లాగే తన పిల్లకికూడా, అత్తా ఆడబిడ్డలు లేని సంబంధం బాగాఉంటుందని ఆవిడ ఎన్నిమొక్కులో మొక్కుకుందట. అయినా, ఈ సంబంధం ససిపడి ఊరుకుంది. నాపోలికేవచ్చి నాపిల్లకి కూడా అత్తగారి అడ్డంకి తీరిపోకపోతుందా అన్న ధైర్యంకొద్దీ, సంబంధానికి ఒప్పుకుందిట. "ఈ వియ్యపురాలు ఇంకా చావకుండా, బతికివుండడమే కాకుండా, మాటిమాటికీ అలకలుకూడా ఏమిటె!" అని కంటగించుకుంటూంది పెళ్ళికూతురితల్లి అని ఒకపుకారు వేశారు. ఆవిడగారిభర్త అర్భకుడు. అంటే, కన్యాదాత తనకిష్టమయినమాట ఎవరు చెప్పినా వినుకునేరకం. తన భార్యమాటకు ఎదురుచెపితే, తనపని ఏమవుతుందో అనుభవంవల్లెరిగేఉన్నవాడు కాబట్టి, తనవియ్యపురాలి అలుక తీర్చేవిషయమైఎటువంటి ప్రయత్నాలు పెట్టుకోక తాలూకా ఆఫీసులో పని ఉన్నదని అవతలకు చక్కాపోయినాడు. మగపెళ్లివారు ఆరోజు రోజంతా కటికి ఉపవాసంఉండి, ఆపెళ్లి పట్నవాసంలో జరగడంవల్ల ఏదో హోటలునుంచి అర్ధరాత్రివేళ ఇంత టిఫిను తెప్పించుకుని తిన్నారు. మర్నాడు ఉభయపక్షాలవారూ శాంతించి, రాజీపడి పెళ్లికాస్తా పూర్తిఅయిందనిపించారు. ఆపెళ్లిఅయిన కొద్దికాలానికే, పెళ్లికొడుకుతల్లి గతించిందని తెలుస్తుంది. పెళ్లికూతురు తల్లికోర్కె ఫలించింద.

పైచేతి వియ్యపురాలికి ముఖం కడిగించడం అనేవేడుక ఒకటి ఉన్నది. తెల్లవారగానే కచ్చికా, తాటాకూ, నీళ్ళూ తీసుకువెళ్లి ఆమెను దంతధావనం చేయించాలి. ఆపెళ్ళివారు. అందుకు తగిన పాటలుకూడా పాడతారు. ముత్తయిదువులు పాడే ఆపాటలలో సారాంశం వియ్యపురాలికి పళ్లు తోమాలిట. పల్లేరుపుల్లతో పళ్లుతోమాలి! పళ్లు చల్లగ తోమాలీ నల్లగ తోమాలి...

పెళ్ళి జరిగినంతకాలం ఆవిడగారిని ఏమీ అనలేక ఆవిడమీదఉన్న కక్ష ఆవిధంగా తీర్చుకుంటారని తోస్తుంది. పల్లేరుపుల్లతో కన్న ఈతముల్లతో తోమితే కొంత ఉపశమన మేమో. ఒకానొక వివాహసందర్భంలో ఏంజరిగిందిఅంటే; పెళ్ళికొడుకు తల్లి వయస్సులోనేఉన్నా, దంతపటుత్వం మాత్రం తప్పి, కొన్నిపళ్లు వాటంతటఅవే ఊడిపోతే, మిగతవి ఆవిడ ఊడపీకించుకుని, ఏకంగా అన్నీ కొత్తపళ్లు పెట్టించుకుందిట. ఆరహస్యం బయటపడకుండా ఆవిడ ముఖాలు కడిగించడం తంతు మానెయ్య

 

# వియ్యపురాళ్లు



మందిటగాని, అవతలివాళ్ళు వినలేదు. ఎంత సేపటికీ ఆవిడ కలిసిరాకపోతే, ఆవిడకేదో అలక వచ్చిందని ఏమీ తోచనిస్థితిలో వున్నం తల్లో, వియ్యపురాలికి దగ్గరైతే అవచ్చి, పెట్టుడుపళ్లీ చట్రంచట్రం ఊడిపడిందట! ఆడపెళ్ళివారి ముత్తయిదువ అదివరకున్న పాటలో కలిపి, "బోసినోటి వియ్యపురాలికి పళ్లతోమండీ! పెట్టుడుపళ్ల వియ్యపురాలికి పళ్ళుతోమండీ!" అని ఆశుకవిత్వం చెప్పిందట. ఆబోసినోటి వియ్యపురాలికి నిజంగానే అలకవచ్చిందిట... పైచేతి వియ్యపురాలు, లేక మేలిరకం వియ్యపురాలు అన్నది ఒక తరగతి మాత్రమే. ఇందులో అనేక విభాగాలున్నవి. పెండ్లికొడుకు పెంపుడుగున్న అయితే, అతని పెంపుడుతల్లీ వియ్యపురాలే, జనకతల్లీ వియ్యపురాలే. సవతితల్లి ఇంకొక రకం వియ్యపురాలు. పెండ్లికొడుకు పెత్తల్లి, పినతల్లులూ వియ్యపురాళ్లే. అతని పెత్తండ్రుల, పినతండ్రుల భార్యలూ వియ్యపురాళ్ళే. అసలు వియ్యపురాలిదే ననుకోండి అగ్రస్థానం...వియ్యంకుడు ఎన్నడో గతించి ఉన్న సందర్భంలో విధవవియ్యపురాలు ప్రాప్తమవుతుంది. వితంతువు వియ్యపురాలయితే, లాంఛనాలు రవ్వంత భేదిస్తాయి. కొఖ్ఖం కొఖ్ఖ మేననుకోండి. చీరలు, రవికెలు బదులు పంచెలు, జామాగ్లు ఉంటాయి. పసుపులూ, పారాణీ, కుంకుమ, గంధం ఉండవు. ఆవిడ నలుగురిలోకీ రాదు. తెరచాటున ఉండి గ్రంథం నడిపిస్తుంది. పెళ్ళిళ్లలో ఉదయమే మగపెళ్ళివారికి ఫలహారాలు పంపించవలసిన బాధ్యత ఆడపెళ్ళివారికున్నది. ఒక పెళ్లిలో కాఫీ, ఉప్మా పంపించేసరికి, వియ్యపురాలు "మడీ, ఆచారం వున్నవాళ్ళకి ఉప్మా లేమిటి? మమ్మల్ని ఎగతాళిచేస్తున్నారు!" అని చిరచిరలాడి విసుక్కుపోయిందిట! "మీకు కాదండీ! మిగతావాళ్ళకండీ," అంటే విని, "ఉప్మా వద్దన్నానుగాని, నాకుమాత్రం వేడుకలు లేవా ఏమిటి? నేను తినేవస్తువే తేవాలని ఎందుకు తోచలేదు?" అని వాదనలోకి దిగిందిట. అప్పుడు మడిగా, ఇంత చలిమిడి ముద్దా, పానకమూ, ఇంత ఉప్పుడుపిండీ తయారుచేయించి పంపించారుట! రోజూ సాయంత్రం మినపరొట్టే, చేగోడీలు, అటుకులు మొదలైన మడిఫలహారాలు పంపించేవారట.

కొన్ని కుటుంబాలలో వియ్యంకుడు పేరుమట్టుకు ఉంటాడు; పెత్తనమంతా భార్యగారిదే! ఆయన మితభాషిగా ఉంటాడు; అతిసాధువుగా ఉంటాడు. ఆయన జోక్యం ఏ విషయంలోనూ కలిగించుకోడు. ఆవిడ కలిగించుకోనివ్వదు. అటువంటి పైచేతి వియ్యపురాలు తటస్థిస్తే మీ పిల్లకి పెళ్ళిచెయ్యడం మానేసి ఊరుకోవడం ఉత్తమం. ఆపైని మీ ఇష్టం.

పైచేతి వియ్యపురాలు ఆడపెళ్లివారిని అనేకవిధాల వేధించడమే కాకుండా, పైపెచ్చు వెక్కిరిస్తుంది; వియ్యాలవారి పాటలు పాడిస్తుంది. వియ్యాలవారి విందు చందము తెలిపితే, అందరికీ ఆనందమువునవునట! కూరే వంకాయకూర, వేరే మరేమి లేదట! అదీ ఉప్పు తక్కువయి, ఉడుకు తక్కువయి, నీళ్లు కారుతూ ఉంటుందిట! అదే పిసుక్కుని తిందామంటే మారు వడ్డించరట! "అప్పడాలు, వడియాలు అసలే లేవండీ!" అని ఆశ్చర్యపోతుంది ఆపాటకత్తె. తమలపాకులయినాను ఇప్పించుతారంటే, ఆకు ఉన్నదిగాని వొక లేదు. ఆకూ పోకా ఉన్నా అది కుళ్లుదీ ఇది పుచ్చుదీ... దీనికంతకు కారణం, ఆ ఎడ్డె, మడ్డి చికిలికళ్ల చింపిరిజుట్టు, గయ్యాళిగడ్డతి పిసినారి, పేకులాట వియ్యపురాలు!

ఇవతల ఆడపెళ్లివారు కూడా మరీ పడివుండరు...వియ్యాలవారి పాటలు అటూ, ఇటూ కూడా వున్నాయి! వాళ్ళవైపు పాటకత్తె పెండ్లికుమారుణ్ని వర్ణిస్తుంది; అతడు గూనివాడు, గ్రుడ్డివాడు, కుంటివాడు, కురూపి, చదువులేదు, సంధ్యరాదు, అంటూ చెప్పి చెప్పి, "సుదతిరో ఈ పెండ్లికొడుకు శుద్ధ వెఱ్ఱివాడు!" అని తేలుస్తారు. ఆడబిడ్డలను, ఆడబడుచు పాటలలో అనేకరకాలుగా వెక్కిరిస్తారు. అటువంటి కొడుకుని ఇటువంటి ఆడబిడ్డలనుకన్న ఆ వియ్యపురాలు ఎటువంటిదయ్యా అంటే, వట్టి కొనిమనిషి; పేచీకోరు, మగవాళ్ల లక్ష్యం లేని మనిషని వర్ణిస్తారు. చాటుగా, పొగచుట్టలు కాలుస్తుందనికూడా చెపుతారు ... ఆవిడకి చిల్లుల అప్పడాలు వడ్డిస్తారు! రకరకాల గుడ్డపీలికలతో చేర్చికుట్టిన రవిక ఆమెకు బహుమానం ఇస్తారు. పచ్చిగడ్డీ, తవుడు మొదలయిన వస్తువులు కానరాకుండా పచ్చని పులుసులో కలిపి ఆవిడచేత తినిపిస్తారు! తమలపాకుల చుట్టలలో గులకరాళ్లూ, పచ్చిమిరపకాయలూ, ఉల్లిపాయముక్కలూ పెట్టి నమిలిస్తారు. గంధం రాస్తూ, రాస్తూ ఆమె చెంపలమీద ఒకటి వేస్తారు. అవతల పెళ్లికొడుకు, పెళ్లికూతురు ఎన్ని సరసాలాడుకుంటారో ఇరువైపుల వియ్యపురాళ్లూ అన్ని సరసాలూ ఆడుకుంటారు.

ఈ వియ్యపురాలి జులుము పెళ్లితో ఆగిపోతుందా? వెనుకటి రోజులలో పెళ్ళి అయిన తర్వాత, పిల్ల పెద్దదయిందన్నప్పుడు, పునస్సంధానసమయంలోను, పిల్లని కాపురానికి తీసుకువెళ్ళే తరుణంలోనూ, ఎప్పుడయినా పుట్టింటికి పంపించడం సందర్భంలోను పైచేతి వియ్యపురాలు తన హోదా చలాయిస్తూనే ఉండేది. తాను బ్రతికి ఉన్నన్నాళ్లూ తన అధికారం రవ్వంత కూడా వెసగనిచ్చేది కాదు; కోడలి పుట్టింటివారిని ఇటు అటు మెసలనిచ్చేది కాదు.

ఇతర దేశాలవిషయం నాకు తెలియదు. విన్నంతలో పశ్చిమ ఖండాలలో వియ్యపురాళ్ల జోక్యం ఇంత ఉండదేమో అనుకుంటాను. అక్కడ బాధల్లా అత్తగారితోనే. లార్డు బైరన్ తాను ఆత్మహత్య చేసుకుందామనుకుని అందువల్ల తన అత్తగారికి ఆనందం కలుగుతుందికనుక మానుకున్నట్టు చెప్పుకున్నాడు.

మనదేశ చరిత్రలో కొంత పరిశోధన చేసినవారు చెప్పగా విన్నాను. ఈ వియ్యపురాళ్ల తంతు ఇటీవలదేనని. శ్రీరాములవారి వివాహంలో వియ్యపురాళ్లు ఏ బెట్టుసరీ చెయ్యలేదు. మీ పిల్లవాళ్లకి పిల్లనిస్తాము రండీ అని జనక మహారాజు మనిషిని పంపితే, రాణులతోటీ రాణువలతోటీ తరలి చక్కా వచ్చాడు, దశరథ మహారాజు. వచ్చి అయినా

సుముహూర్తం సమీపిస్తుంది కాబోలు మమ్ముల్లను రమ్మన్నారా అని విడిదినుంచి తానే వేడుకుంటాడు. ఒ రుకోదు, ముగురు వియ్యపురాళ్ళు పల్లెత్తి మాట్లాడలేదు. రుక్మిణీ శ్రీకృష్ణుల వివాహంలోనూ, శకుంతలా దుష్యంతుల వివాహంలోనూ వియ్యపురాండ్ర మాటేలేదు. ద్రౌపదీ వివాహంలో కుంతీ మహాదేవి ఎంతమాత్రం తీవి చూపలేదు. రుక్మిణీ శ్రీకృష్ణుల వివాహం రాక్షస వివాహంగనుక శకుంతలా దుష్యంతుల వివాహం గాంధర్వవివాహం కనుక, సీతా ద్రౌపదీదేవుల వివాహాలు స్వయంవరాలు గనుకా వియ్యపురాళ్ల జోలి లేదనుకుందాము. కాని ఇరువైపులా ఉండవలసిన బలగమంతా ఉండి జరిపించిన ఉత్తరాభిమన్యుల వివాహంలో విరాటరాజు, యాజ్ఞసేనీ, సుభద్రలు కనురూపాభరణ పరిధానంబులు మాత్రం పంపించినట్లు కనబడుతుంది. కాని ఒక్కమాటయినా ద్రౌపదీ సుభద్రా అలిగినట్లు కనబడదు తాను పైచేతి వియ్యపురాలైనందుకు సుధేష్ణవిషయంలో ద్రౌపది ఎంత కసితీర్చుకోవలసి ఉన్నది!

ప్రస్తుతకాలంలో మనలో కూడా వియ్యపురాళ్ల సంస్థ నశించే సూచనలు కనబడుతున్నాయి. చిన్నవయస్సులో ఉన్న పిల్లలకు పెళ్ళిళ్లు చేసేటప్పుడు, ఆ పెళ్ళి అయిదురోజులు చేసేటప్పుడు ఆ అయిదు రోజుల్లూ పెద్దవాళ్లే వేడుకలకోసం ఏర్పాటయిన ఆచారాలు ఇప్పుడు అమలులో నుంచి పోతున్నాయి. స్వయంవరాలు బలిసిపోతున్నాయి. వియ్యంకులు వియ్యపురాళ్ళకన్న ముందు వధూవరులే అన్ని ఏర్పాట్లు చేసుకుంటున్నారు. పెళ్ళిళ్ళు ఒక్కరోజులో, ఒక్కపూటలో అటూ ఇటూ తల్లిదండ్రులు రాకుండాకూడా జరిగిపోతున్నాయి. కొన్ని పెళ్లిళ్లు రిజిష్ట్రారు కచేరీలో జరుగుతున్నాయి. వయస్సు ముదిరిన వధూవరులకు, వియ్యంపొందవలసిన ఈడున పెళ్లిళ్లు జరుగుతున్నాయి. అట్టి స్థితిలో వియ్యపురాళ్లూ లేరు; వేడుకలూ ఉండవు. రిజిస్ట్రేషను పెళ్ళిళ్లలో రిజిష్ట్రారు గారిమీద పన్నీరుచల్లి, బంట్రోతుకు గంధం పూయాలి. కొంత 'రుసుము' చెల్లిస్తే ఒప్పుకుంటారు, సందేహం లేదు.

—విజయవాడ రేడియో సౌజన్యంతో.]



# ★ యాత్రా విశేషాలు ★

(4-వ పేజీ తరువాయి)

సమస్యకూ, హాంకాంగ్‌లో ఏర్పడినదానికీ అనేక పోలికలు వున్నవి. హాంకాంగ్ పాలకులు తమ సమస్యను ఈవిధంగా వర్ణించారు:

"శరణార్థులు విక్టోరియా, కౌయిర్లూన్ రెండు పట్టణాలమీదపడి కనపడిన ప్రతిఖాళీ స్థలంలోనూ తిష్ఠవేశారు; ససేమిరా అక్కడ నుంచి కదలమన్నారు. ఆయాస్థలాల కామందులు ఎవరు, వాటిని ఆ విధంగా బలవంతాన ఆక్రమించుకుంటే ఏమైనట్టనే విచక్షణ కూడా వారు చూపలేదు. వారి అవసరం అలాంటిది. మరెక్కడా ఒక్కచదరపు అడుగు నేలైనా లేదని గ్రహించినమీదట మిగతా శరణారులు కొండప్రాంతాలకు ఎగబాకడం మొదలుపెట్టారు. ప్రతి కొండలోయనూ, ప్రతి పర్వతపాదాన్నీ ఆక్రమించుకున్నారు; సాధారణ పరిస్థితులలో మానవమాత్రుడైనవాడెవడూ అక్కడ నివసించలేడు. చౌకగా ఏ సామగ్రి దొరికితే ఆ సామగ్రి అంతా తెచ్చి ఎక్కడికక్కడ చిన్నచిన్న కుటీరాలు నిర్మించుకున్నారు. వంపులుతీసి సాఫీచేసిన రేకులు, చెక్కలు, దళసరి అట్టలు, గోనెసంచులు మొదలైన సమస్త తేలిక పరికరాలనూ ఇందుకు వారు ఉపయోగించుకున్నారు. తాహతు వున్నవాళ్లు వీలైతే ఋణమో పణమో ఇచ్చి ఈ పరికరాలు కొనుక్కున్నారు; తాహతు లేని వాళ్ళు వారినీ వీరినీ అడిగి ముష్టి ఎత్తారు; ఏదీ కాకపోతే, కనపడిన పరికరాన్ని కనబడినట్టు తస్కరించారు!

"ఈ కుటీరాలు జనసమ్మర్దంతో కిటకిటలాడిపోయినవి. 40 చదరపు అడుగుల విస్తీర్ణంగల ఒక్కే ఒక గుడిసెలో ఐదుగురూ ఆరుగురూ తలదాచుకోవలసివచ్చింది. ప్రతి ఎకరా నేలకు 2 వేలమంది ప్రజలు నివసించడం మొదలుపెట్టారు. గాలి వెలుతురు మొదలైన ఆరోగ్యసదుపాయాలు పూర్తిగా మృగ్యం. మానవ అమేధ్యాన్నైనా ఎత్తి పారవేయడానికి ఏర్పాట్లు లేకపోయినవి."

బహుముఖాలుగా అనేక ప్రయత్నాలు చేస్తేనే గాని ఈ సమస్యను పరిష్కరించలేకపోయినారు. ప్రత్యేక పునరావాసశాఖ ఒకటి ఏర్పాటుచేశారు. ఇంగ్లీషు అక్షరం "హెచ్చి" ఆకారంలో వున్న ఆరంతస్థుల భవనాలను అనేకం ఈ శాఖ నిర్మించింది. ఒక్కొక అంతస్థులో 64 గదులు వున్నవి. 'హెచ్చి' అక్షరంలోని అడ్డగీత మీద వుండే అంతస్థులలో వరసగా నీటికొళాయిలు ఏర్పాటుచేశారు. అందరూ గుడ్డలు ఉతుక్కోడానికి అందులోనే కొంత ఖాళీస్థలం కూడా వుంచారు. భవనానికి నాలుగుమూలలా పై అంతస్థులకు పోయేమెట్లు అమర్చారు. ఏడేసి అంతస్థులు గల విశాలమైన భవనాలనైనా ఎనిమిది వారాలలో ఇట్టే నిర్మించి వేయగలిగారు. ఒక్కొక్క అంతస్థులో కుటుంబాలు నివసించడానికి 250 చదరపు అడుగులచోటు వుంటుంది.

1954 వసంతంలో 50 వేలమంది శరణార్థులకు ప్రతి పక్షం రోజులకూ ఉచిత భోజన సౌకర్యం కలుగజేయడానికి ఖర్చుపెట్టిన డబ్బుతో రెండువేలమంది నివసించడానికి వీలైన బ్రహ్మాండమైన ఆరంతస్థులదివ్యభవనం ఒకటి కట్టవచ్చునని అధికారులు లెక్కలు తేల్చారు; కుటుంబాల ఆర్థికశక్తిని బట్టి, భవన నిర్మాణ వ్యయాన్నిబట్టి అద్దెలు నిర్ణయించారు. ప్రభుత్వం సగంధరకే నివేశన స్థలాలను మంజూరుచేసింది; నూటికి ఏడాదికి మూడున్నర వడ్డీరేటు చొప్పున పెట్టుబడికి డబ్బు 40 ఏళ్లలో తీర్చుకునే పద్ధతిమీద అప్పుగా ఇచ్చింది. 432 గదులున్న ఏడంతస్తుల భవన నిర్మాణానికి 7,95,600 హాంకాంగ్ డాలర్లకంటే ఎక్కువ ఖర్చుకాలేదు. చదరపు అడుగు ఒకటికి 10 డాలర్లు (హాంకాంగ్) చొప్పున, ఈ విశాల భవనాల నిర్మాణానికి ఒక్కొకదానికి 23 వేల చదరపుఅడుగుల స్థలం కావలసివచ్చింది. ప్రభుత్వం ఈ ఖర్చుకుగాను ఆమాంబాపతు పద్దులకిందా సాలుకు దాదాపు 65 వేల డాలర్లు వసూలు చేస్తుంది. అంటే అద్దె ఒక్కొక గదికి పధ్నాలుగు డాలర్లకు మించి పడదన్నమాట.

ప్రతిభవనంమీద పెట్టినఖర్చూ నలభై ఏళ్లలో ప్రభుత్వానికి తిరిగి వచ్చేస్తుంది.★

# రగడ విరగడ

"ఏయ్... నిన్నే ఈలా రా?" అన్నాడు మూర్తి.

లోపలనుండి "ఎందుకండి? అన్నం వార్చాలి" అన్నది శ్రీదేవి.

"రమ్మంటున్నాతే ఏమిటా పెంకి సమాధానము?" అన్నాడు మూర్తి.

"అబ్బ వుండండి? అన్నం మెత్తపడుతుంది" అన్నది శ్రీదేవి.

"నీకేమన్నా పొగరా...రమ్మంటుంటే" అన్నాడు మూర్తి.

"ఏమిటండి? పొయ్యిమండక నేను పతమతమవుతుంటే!" అన్నది శ్రీదేవి.

"ముందు వస్తావా? రావా?" అన్నాడు మూర్తి.

"అబ్బ! ఉండండి! వస్తున్నాను..." పొయ్యిలోని పొగకు కళ్లనుండి నీరు కారుతూంది. "ఏమిటండి?" అన్నది శ్రీదేవి.

"ఏమిటా దరిద్రము...ఎప్పుడూ ఏడుస్తూనే వుంటావు...ఛీ...నీ జన్మ తగలెయ్య...నీ బ్రతుకు ఎప్పుడింతేలే..." అన్నాడు మూర్తి.

"సరేలెండి? ఎవరన్నా వింటే నవ్వుతారు...ఏమిటి? చెప్పండి?" అన్నది శ్రీదేవి.

"ఎంత సంగనాచిలాగ అడుగుతున్నావ్? దొంగతనము, రంకుతనము ఏడు ఘడియలకంటే ఎక్కువ దాగదు...తెలుసా?" అన్నాడు మూర్తి.

"అయితే నేను ఏమిచేశానని యిప్పుడు!" అన్నది శ్రీదేవి.

"నీకు తెలియదూ? .... సంగనాచిలాగ మాట్లాడుతున్నావు?" అన్నాడు మూర్తి.

నవ్వుతూ "సరే! నేను వెళుతున్నాను" అన్నది శ్రీదేవి.

"ఆగు! నా ప్రశ్నకు సమాధానము చెప్పు?" అన్నాడు మూర్తి.



"ఏమిటండీ యీ ధోరణి?" అన్నది శ్రీదేవి.

"నీకు ధోరణిగానే వుంటుంది. వలుగురిలో నన్ను నవ్వులపాలు చేశావు. నీవు ఎంతకైనా సమర్థురాలివి!" అన్నాడు మూర్తి.

"చంపక చెప్పండీ? ఏం జరిగిందండి?" అన్నది శ్రీదేవి.

"ఎంత జరగాలో అంతా జరిగింది. అందరి ఆడవాళ్లవంటిదానవుగావు నీవు... తలలు మార్చగలదానివి?" అన్నాడు మూర్తి.

"నన్ను విసిగించక చెప్పండీ? నేనేం చేశానో" అన్నది శ్రీదేవి.

"అదే నేను అడుగుతున్నాను...నీ వేం చేశావు?" అన్నాడు మూర్తి.

"మీరే చెప్పండి?" అన్నది శ్రీదేవి.

"చేసినదానివి నీవే చెప్పకపోతే...విన్నవాడను నేనా చెప్పేది. నీవు చేసినదంతా నీవే చెప్పు!" అన్నాడు మూర్తి.

## అల్లంకి చెల్లారావ్.

"ఏమిటండీ? ఇన్ని రోజులనుండి లేనిది యీ రోజు ఏమిటి? అదో రకముగా మాట్లాడుతున్నారు" అన్నది శ్రీదేవి.

నీకు అట్లాగే వినబడుతుంది. బజారుకు వెళ్ళు తెలుస్తుంది..." అన్నాడు మూర్తి.

"బజారులో అనుకునేంతపని నేనేం చేశాను." అన్నది శ్రీదేవి.

"ఏమి చేశావో...ఎవరికి తెలుసు?" అన్నాడు మూర్తి.

"అనవసరంగా మాట్లాడకండి? ఎంతవరకు మాట్లాడాలో అంతవరకు మాట్లాడండి!" అన్నది శ్రీదేవి.

"ఏమీ...పరపురుషుని పక్కలో పెట్టుకొని పరాచికలాడవచ్చుగాని ... తాళికట్టిన భర్త ఉన్నమాట అంటే అంత ఉలుకా" అన్నాడు మూర్తి.

కళ్లనిండా నీరు నిండుతుంది. ఏడుస్తూ "ఏమిటండీ యీ అఘాయిత్యము, మీరు తెలిసే మాట్లాడుతున్నారా? ఎందుకండీ? యీ రోజు యిలా అడుగుతున్నారు... నన్ను పరీక్షిస్తున్నారా?" అన్నది శ్రీదేవి.

"అబ్బో! మహా పతివ్రత బయలుదేరింది.. సతీఅనసూయ కదూ..." అన్నాడు మూర్తి.

"నేను కాపురానికివచ్చి ఐదు సంవత్సరములయింది కదా? ఆ మాత్రము భావమును గ్రహించలేరా?" అన్నది శ్రీదేవి.

"సరే...నిన్ను ఎంత ప్రేమతో చూచానో...ఎన్ని కోర్కెలు తీర్చానో, నీతో ఏ విధముగా ప్రవర్తించానో అది నాకేకాక నీకుకూడా తెలుసు. నిన్ను ప్రేమించే నాకే అపరాధము తలపెట్టావు. ఇక నీకు యిక్కడ స్థానములేదు" అన్నాడు మూర్తి.

"మీ పాదాలు పట్టుకుంటాను. ఇటువంటి మాటలనకండి. కావాలంటే నన్ను కత్తితో పొడిచి చంపండి" అని రెండుపాదాలు పట్టుకుంది శ్రీదేవి.

"నీవా...నా పాదాలు పట్టుకొని అపవిత్రము చేశావు...ఛీ...ఫో..." అని మూర్తి నెట్టాడు.

"నా బొందిలో ప్రాణముండగా నా పతినుండి నన్నెవ్వరూ విడదీయలేరు. నా ప్రాణాలు యీ పాదాలదగ్గర పోవాల్సిందే" అని ఏడుస్తూ తలను రెండుపాదాల ముందుంచింది శ్రీదేవి.





# రగడ విరగడ



"నిన్ను దయతలిస్తే నీపాపములో భాగం పంచుకోవలసివస్తుంది. నీవు చేసినపనికి నిన్ను భగవంతుడైనా క్షమిస్తాడా?" అన్నాడు మూర్తి

"మీరు ఎన్నయినా అనండి...నేను ఏ పాపమూ ఎరగను...మీమీద ఒట్టు"అన్నది శ్రీదేవి.

"ఓహో...నేను బ్రతికి వుండటముగూడ ఇష్టములేదన్న మాట!" అన్నాడు మూర్తి.

"నన్ను ఎందుకింత బాధపెడతారు. కత్తితో పొడవండి. హాయిగా ప్రాణాలు విడుస్తాను" అన్నది శ్రీదేవి.

"హాయిగా...నీ ఇష్టము వచ్చిన చోటుకే వెళ్లు...నిన్ను నీపాపానికే వదులుతున్నాను. ఏ చేతులతో నిన్ను అలంకరించానో ఆచేతులతోనే నిన్ను నాశనము చేయలేను. పాప పుణ్యాలు విచారించే భగవంతుడు నీకు తగిన శిక్ష విధిస్తాడు. ఇక నీముఖము నాకెన్నటికీ చూపించకు పో..." అన్నాడు మూర్తి.

"నన్ను అట్లా అనకండి.. నేను ఏపాపం ఎరగను.. మిమ్మలను విడిచి ఒక్కరోజు కాదుగదా...ఒక్క నిమిషమైనా బ్రతకగలనా? నన్ను విడవకండి. మీపాదాలు పట్టుకుంటాను. మీరు ఏ పరీక్ష పెట్టినా, దానికి నిలుస్తాను. నన్నుమాత్రము విడవకండి... ఏమండీ మీకు పుణ్యముంటుంది. అనండీ విడవనని అనండీ...ఏమండీ...మిమ్మల్నే నండి, నా వేపుచూడండి...నేనునిర్దోషిని... నా ముఖము చూడండి...నేను పోను... మిమ్మల్ని విడిచి పోను..." అన్నది శ్రీదేవి.

"నన్ను యికనైనా విసువదలచుకో లేదా...నీకు పదివేలనమస్కారాలుచేస్తాను. వెళ్లు నాకళ్ళముందునుండి. నన్నునవ్వులపాలు చేయకు...కావాలంటేనీకు ధనమిస్తాను..." అన్నాడు మూర్తి.

"ఆగండి...మీ ధనానికి...ఆశించ లేదు.. నన్ను నిలువునా చీల్చినాసరే...నామీద మాత్రము అపనిందవేయకండి. మీ పాపము మీరే అనుభవిస్తారు. ఒకనాటికి పశ్చాత్తాప పడకపోరు..."అన్నది శ్రీదేవి.

"ఈ వేదాంతాలకేమిలే ... పోతావా పోవా..." అన్నాడు మూర్తి.

"పోను...ముమ్మాటికీపోను..." అన్నది శ్రీదేవి.

"ఏంచేస్తానో తెలుసా..." అన్నాడు మూర్తి.

"ఏమన్నా చెయ్యండి...చంపినాసరే.." అన్నది శ్రీదేవి.

"నాదగ్గర నీ పప్పులుడకవు...వెళ్లు ముందర..." అన్నాడు మూర్తి.

"వెళతాను"...ఆలోచించి "అయితే వుండండి" అని తలనుస్తంభానికి వేసి బాదుకోబోయింది శ్రీదేవి.

"ఆగుదేవీ...నిన్ను బాధపెట్టినందుకు నన్నుక్షమించు..." అన్నాడు మూర్తి.

"నిజమా...ఎంతమాట...నన్నే మీరు క్షమించండి" అన్నది శ్రీదేవి.

"ఇదంతా కలగామర్చిపో...నేను నిన్ను ఎంతో బాధపెట్టాను. లే" అని లేవదీసి కళ్లనీళ్లను తుడుస్తూ "ఎందుకు అంతభయము. ఈ చిన్నవిషయానికి యింత దుఃఖించాలా" అన్నాడు మూర్తి.

"ఇంక ఎప్పటికీ యిలాటిమాటలు మాట్లాడనని చేతిలో చెయ్యివెయ్యండి" అన్నది శ్రీదేవి గట్టిగా కౌగలించుకుంటూ.

వీపునిమురుతూ "నిన్ను విడచి నేను బ్రతుకగలనా...ఎంత అమాయకురాలివి... అసలుసంగతి చెప్పనా" అన్నాడు మూర్తి.

"చెప్పండీ?" అన్నది శ్రీదేవి.

"రేపునాటకములో వేషము వేస్తున్నాను" అన్నాడు మూర్తి.

"వేస్తే?" అంది శ్రీదేవి.

"యిపుడు నేను మాట్లాడినదంతా నాపోర్షన్" అన్నాడు మూర్తి.

"చంపారు. అయితే ముందు ఎందుకు చెప్పలేదు" అన్నది శ్రీదేవి.

"చెప్తే...ఆభావాలునీకురాకపోవును... నీకురాకపోతే నాకురావు" అన్నాడు మూర్తి.

"ఇదంతా నటనా? ఎంతబాగా నటించారండి! నిజమనుకొని చచ్చానంటే నమ్మండి. రేపుడ్రామాలో మీ దేషష్టు ప్రయిజు ఆ ప్రయిజు నాకేయివ్వాలండి" అన్నది శ్రీదేవి.

"ఆ ప్రయిజు రేపు...యీనాటికీ ప్రయిజు" అని ముద్దు పెట్టుకొన్నాడు మూర్తి. ★

# పాఠకలోకంపై పన్నీటిజల్లు!

## ★ వినాయకచవితికి ★

## ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక



# హాస్యసంచిక



నవ్వు ఆనందానికీ, ఆరోగ్యానికి పర్యాయపదం. హాస్యం అనేకవిధాలుగా ఉంటుంది. పల్లెటూరిహాస్యం ముతక; బస్తీహాస్యం మెతక. కోర్టుల్లో జడ్జీలు, లాయర్లు, ముద్దాయిలు; ఆస్పత్రుల్లో డాక్టర్లు, రోగులు; పాఠశాలల్లో మేష్టర్లు, విద్యార్థులు, ఒకరిమీదఒకరు ఛలోక్తులు విసురుకుంటారు. ఇంట్లో భార్యాభర్తలు, బావామరదళ్లు, బావామరుదులు, పెళ్లిళ్లలో వియ్యాలవారు వేళాకోళా లాడుకుంటారు. రాజకీయాల్లో, సాహిత్యంలో, నాటక రంగస్థలాలమీద హాస్యప్రియులుగా ప్రసిద్ధికెక్కిన ప్రముఖు లెందరో ఉన్నారు. హాస్యానిది జీవితంలో విశిష్టస్థానం.

హాస్య రచయితకు ప్రజలమీదఉండే పలుకుబడి ఇంకెవరికీ ఉండదు. హాస్యరచన పాఠకుల్ని నవ్వించి, కవ్వించి, ఆనందింపజేయడమేగాదు, జీవితంలోని లోపాలెత్తిచూపి, కడిగేసి, దులిపేసి హృదయాలను నిర్మలంచేస్తుంది.

తెలుగులో హాస్యరచనలను ప్రోత్సహించే ఉద్దేశంతో ఈ ఏడాది ఆంధ్ర వారపత్రిక వినాయకచవితి [28-8-57] సంచికను హాస్యసంచికగా ప్రచురిస్తున్నాము. సంచిక ఆసాంతం హాస్యం ఉట్టిపడేలా చేయాలని మా ఆశయం.

### కవరు పేజీకి బహుమతి

వినాయకుడు హాస్యమూర్తి: కనుక హాస్యసంచిక అట్టమీద వినాయకుడే ఉంటాడు. వినాయకునికి సంబంధించిన చక్కనిహాస్య సన్నివేశం కల్పించి, వర్ణచిత్రం పంపవలసిందిగా చిత్రకారులకు విజ్ఞప్తి. ముఖచిత్రానికి అంగీకరించిన చిత్రానికి రూ. 50/- పారితోషిక మిస్తాము. [సైజు 8" × 11"]

హాస్యరసప్రధానమైన కథలు, నాటికలు, వ్యాసాలు, గేయాలు, ఛలోక్తులు, వేళాకోళాలు, ఇవికాక దైనికజీవితానికీ, రాజకీయాలకూ సంబంధించిన కార్టూన్ చిత్రాలు ప్రచురిస్తాము. వనితాలోకం, బాలసాహితి, సినిమాశీర్షికలలోకూడా అన్నీ హాస్యరచనలే ప్రచురిస్తాము. ఆంధ్ర రచయితలు, ముఖ్యంగా హాస్య రచయితలు మా ఆశయం జయప్రదంగా నెరవేరడంలో సహకరిస్తారని విశ్వసిస్తున్నాము. వేళాకోళమాడడం తెలుగు ఆడబడుచులకు వెన్నతోపెట్టిన విద్య. అందుచేత వనితల సహకారానికి ఇదే మా ప్రత్యేక విజ్ఞప్తి.

హాస్యసంచికను రచనలు పంపేవారు ఆగస్టు 1 వ తేదీకే మాకు అందేలా "సచిత్ర వారపత్రిక హాస్యసంచికకు" అని వ్రాసి పంపించాలి. కథలైనా, నాటికలైనా, వ్యాసాలైనా వారపత్రికలో మూడు పేజీలకు మించకూడదు. కార్టూన్ చిత్రాలు డ్రాయింగ్ పేపరుమీద ఇండియన్ ఇంక్‌తోనే వేసిపంపాలి.

# పురాణప్రభావం

ఎ. వి. మోహన్



[గతసంచిక తరువాయి]

మిత్రుడు: రుక్మిణీ కళ్యాణం. టీకా తాత్పర్య సహితం. ఓయబ్బో! పురాణం వినటం కాకుండా పద్యం పద్యం అర్థ సహితంగా బట్టీ వేస్తోందా యేమిటి కోడలు.?

భార్య:–(గరాటుతో వున్న కిరసనాయిలు సీసా నిప్పుపెట్టె పట్టుకుని లోపలినుంచి వచ్చి) శాస్త్రులుగారు యెంత బాగా చెబుతున్నారనుకున్నావు. అరిటిపండు వొలిచి చేతులో పెట్టినట్టు అర్థం ఆయన వివరంగా వినిపిస్తుంటే కథ కళ్ళకు కట్టినట్టుంటుంది. పుస్తకం యింట్లో వుంటేను, తనివి తీరక, మధ్యాహ్నం వేళ మళ్లా అమ్మాయి ఆ పద్యాలన్నీ చదువుతూ వుంటుంది. (లోపలికి వెడుతుంది.)

మిత్రుడు: (గుర్తు పెట్టి వున్న చోట పుస్తకం తెరిచి కొంచెంసేపు మానసి పైకి చదువుతాడు)

ఉ|| అన్న తలంపు దా నెరిగి యన్న వనీరజ
గంధి లోనసా
పన్న తనొంది యాప్తుడగు బ్రాహ్మణు
నొక్కని జీరిగర్వసం
ఛన్నుడు రుక్మి నేడు నను జైద్యున
కిచ్చెదనంచునున్న వా
డన్ని విధంబులం జని బుధీశ్వర,
చక్రికి విన్నవింపవే.

తాను ఏరి కోరి వలచి వివాహమాడ దలచిన శ్రీకృష్ణులవారికి ఇంట్లో ఎవరికీ తెలియకుండా రహస్యంగా వో బ్రాహ్మణోత్తముడి ద్వారా ప్రణయ సందేశం పంపింది రుక్మిణీదేవి. అంత సాహసం అమ్మవారు కనక చేసింది గాని...

భార్య: (ఇస్త్రీ తుండుగుడ్డ చేత్తో పుచ్చుకుని ప్రవేశించి) నువ్వు పద్యాలింత బాగా చదువుతావనుకోలేదు తమ్ముడూ! ఆ పై పద్యం చదువు. అన్నగారిని వారించే శక్తి తండ్రికి లేకపోవటం చేత రుక్మిణీ అమ్మవారు అలా సాహసించాలిసొచ్చింది. (లోపలికి వెడుతుంది.)

మిత్రుడు:

క|| అయ్యా! కొడుకు విచారము
లయ్యయు వారింపజాల డటుగాకురిడన్
నెయ్యమెరిగించి చీరుము
చయ్యన నిజసేవకాను సారిన్ శౌరిన్.

[వచనం వచ్చినప్పుడల్లా కొంత పైకి, కొంత లోపల్లోపలా చదువుతూ వుంటాడు. తనలో చదివేదికూడా అస్ఫుటంగా ప్రేక్షకులకు వినిపించుతూ వుంటుంది.]

వ|| అనికొన్ని రహస్యవచనంబులు సెప్పిన విని బ్రాహ్మణుండు ద్వారకా నగరంబునకుం జని...... పురుషోత్తముం గాంచి పెండ్లి కొడుకవుగమ్మని దీవించిన ముసిముసినగవులు నగుచు...............

ఉ|| ఎవ్వని దేశమందునికి యెవ్వనిచే సుకే
లంబుగల్గు మీ
కెవ్వని రాజ్యమందు బ్రజలెల్ల సుఖిం
తురు వాడు మద్ప్రియుం
డెవ్వనరాకి దుర్గమున కెట్లరుదెంచితివయ్య
నీవు నే
నవ్వులుగాదు నీ తలపునంగల కే లోన
రింతు ధీమణీ!

వ|| అనియిట్లు లీలాగృహీత శరీరుండైన యప్పరమేశ్వరుం డడిగిన ధరణీ సురవరుం డతనికి సవినయంబుగా నిట్లనియె. దేవా విదర్భ దేశాధీశ్వరుండైన......

......డా రాజకుమారు రుక్మిణి యను కన్యకామణిగల దయ్యిందువదన నీకు...... వివాహమంగళ ప్రశస్తంబయిన యొక్క సందేశంబు విన్నవింపుమని పుత్తెంచె నవధరింపుము.

సీ|| ఏనీగుణములు కర్ణేంద్రియంబుల
సోక దేహతాపంబులు తీరిపోవు
నేనీ శుభాకార మీక్షింప కన్నుల
కఖిలార్థలాభంబు కలుగుచుండు
నేనీ చరణసేవ లేప్రొద్దు జేసిన
భువనోన్నతత్వంబు బొందగలుగు
నేనీల సన్నామ మేప్రొద్దు భక్తితో
దడవినబంధ సంతతులువాయు
నట్టి నీయందు నాచిత్త మనవరతము
నచ్చియున్నది నీయాన నానలేదు
కరుణజూడుము కంసారి, ఖలవిదారి
శ్రీయుతాకారమానినీ చిత్తచోర!

భార్య: (వెనకటి విలువైన దుస్తులు అధికజాలు తీసేసి మామూలు వంటయింటి వేషంలో ప్రవేశించి) పద్యాలు చక్కగా చదవగలవుగదా! వదిలిపెడతావెందుకు, వరసగా చదవరాదూ? ఎన్నిసార్లు విన్నా, మళ్ళీ మళ్ళీ వినాలనే వుంటుంది.

మిత్రుడు: శ్రీకృష్ణపరమాత్మ గాథలే అట్లాంటివి! అందులో పోతన్నగారు అద్భుతంగా చిత్రించారు.

భార్య: అందులోనూ శాస్త్రులుగారు చదివి చెబుతుంటే మనస్సు మనమే మరిచిపోతాం, యిల్లువాకిలి సంగతట్లావుంచి,

మిత్రుడు: "నన్ను తీసుకుపోయి రాక్షస వివాహం చేసుకోవలసింది" అని స్పష్టంగా కబురు పెట్టింది రుక్మిణీదేవి. శ్రీకృష్ణులవారి




పుష్పమువలె...
రెక్సోనాతో మీ చర్మ
సౌందర్యము వికసించును
రెక్సోనా సబ్బులో, కేడిల్...చర్మమును పోషించు
నటువంటియు మీ సహజ సౌందర్యమును బయల్పరచు
టకు సహకరించునటువంటియు ఒక ప్రత్యేక నూనెల
మిశ్రమము గలదు!

Rexona
BLENDED WITH CADYL
ఇది ఒక్కటే కేడిల్‌తోగూడిన సబ్బు

# ★ పురాణ ప్రభావం ★

మీద ఆమె మనసు అంత గాఢంగా నాటుకు పోయింది మరి.

భార్య: "......రాక్షస వివాహమునన్ భవదీయ భార్యనే యొనరుపవలెను కృష్ణ పురుషోత్తమ చేకొని పొమ్ము వచ్చిదన్." అంతే కాదు తల్లిదండ్రులకు ఆ ప్రయత్నానికి పోనికల క్కుండా తనను తీసుకుపోయే అపాయంలేని ఉపాయంకూడా తెలియచేసింది.

మిత్రుడు: అవును. ఇదుగో! యిక్కడ పద్యం వుంది. యీ సీసాలు రాగయుక్తంగా అనాలంటే టంగులు తెగుతయ్యి.

సీ॥ లోపలి సౌధంబులోన వర్తింపంగ
దేవచ్చునే నిన్ను దెత్తునేని
గావలివారల గలబంధువుల జంపి
కానితేరాదని కమలనయన
భావించితే నిసుపాయంబు సెప్పెద
వాలింపు కులదేవ యాత్రజేసి
నగరంబు వెలువడి నగజాతకును మ్రొక్క
పెండ్లికి మునుపడ పెండ్లికూతు
రెలమి మావారు బంపుదు రేనునట్ల
పురము వెలువడి రేతెంచి భూతినాథు

పతికి మ్రొక్కంగ నీవున్న సమయమందు
వచ్చి కొనిపొమ్ము నన్ను సవార్యచరిత."

ఎంత తెలివి అనుభవం లేకపోతే అంత చక్కని ఉపాయం తోస్తుంది! ఆహాహా! ఏమి ఉపాయం! యెంత దూరదృష్టితో చెప్పింది! హో హో హో హో హో!!!

యజమాని: [చొక్కా వుండదు. బనీనుతో వుంటాడు. ధోవతి బనుకట్టేడే. కాళ్లు, చేతులు, ముఖము కడుక్కొని, భార్య ఇచ్చిన తుండుగుడ్డతో తుడుచుకుంటూ ప్రవేశించు తాడు.] వచ్చి వచ్చి చివరకు పురాణం పట్టింటోళ్లకే వేసినట్లుందే చూడగా!

మిత్రుడు: ఆఁ! యేంటో! వింటరిగా కూర్చుంటే బోరుకుపోక.

భార్య: పురాణం అంటే వారూ వీరూ చెప్పేదనుకుని మీరట్టా అంటున్నారు. శాస్త్రులుగారు చెప్పేదే పురాణం. వారు ఆ పద్యాలు చదువుతూ అందరికీ తెలిసేట్టు అర్థం చెబుతూంటే శ్రీకృష్ణపరమాత్మ మురళి విని గోపికలందరూ ఆడుయచుటూ యెట్టా మూగారో అట్టా మూగిపోవాలిసిందే జనం. అంత బాగుంటోంది. మీరూ వింటారుగా! నా మాట లబద్ధమేమో!

యజమాని: నా సొత్త్వంకూడా యెందుక్కాని; అమ్మాయి యింకా రాలేదే?

భార్య: సావిత్రి వాళ్ళింట్లోకి వచ్చాని రోజా తెచ్చుకుంటోంది. ఇవ్వాళ వొడిలి పెట్టుంటాడు. [వంట యింటివరకు వచ్చిందో చూట్టానికి లోపలికి వెడుతుంది.]

యజమాని: వొడిలి పెట్టక పుట్టుకుంటుంది! పొద్దుకూకి చాలసేపయ్యి పొద్దునా లేమిటి? వొంటిమీదికి యేళ్ళు వస్తున్న కొద్దీ మరీ మరీ పోతోంది.

మిత్రుడు: వస్తుంది లేవయ్యా! చిన్న తనంలో యిప్పుడు పెత్తనాలు చెయ్యకపోతే పెళ్ళి అత్తవారిళ్లకు వెళ్లాక చేస్తారా?

భార్య: [లోపలినుంచి వస్తుంది] ఇంతకూ వెళ్లిన పనేమైందండీ? కాయా, పండా?

యజమాని: యిప్పటిదాకా వొళ్లు తెలియ లేదు! నీ మనస్సంతా పురాణము, శాస్త్రుల్లు మీద లగ్నమైపోయింది. బాగుంది పురాణమూ, శాస్త్రులే?

భార్య: కర్మంచాలక కాలు బయట పెట్టానో లేదో యిదీ వరస! మీ రెప్పుడూ యింతే లెద్దురూ!

యజమాని: నీకంటికి యింతకాక మరెంతగా కనిపిస్తాను?

భార్య: పోనీలెద్దురూ! ఏ మాటన్నా తప్పితే! (లోపలికి వెడుతుంది)

మిత్రుడు: ఏం! బావా! వెళ్ళింది వరా స్వయంగా! వనూళ్ళకని బలేకథ అల్లావే!

యజమాని: యే కథలూ అల్లకుండా మీరంతా నిత్యం చేసేవన్నీ చేసినట్లే చెబుతున్నారు, మహా! గాంధీకి అన్నయ్యలు, తమ్ముళ్లూను!

మిత్రుడు: నా దగ్గర దాస్తావనుకుంటే అసలు కదిలించేవాణ్నే కాదు.

యజమాని: దాయటానికేముందిగాని; యీడీ పిల్లలు కాకుండా పైకనటం యెందుకు, తెలిసిపోతే తేలికైపోతాముగా అని.

భార్య: (లోపలినుంచి వస్తుంది) పిలవ చూట్టానికి యెప్పుడో స్తామన్నారండీ? మల్లా మూహూర్తము. ఆ పైన పువ్వులు. తమ్ముడూ! యెక్కడున్నా నోరు జారేవు? వాళ్ళో అన్నీ పోటీలే. అంతా విరోధులే. వేగలేకుండా వున్నాము.

యజమాని: పైటవాళ్ళసంగతెట్టావున్నా ముందు నీతో వేగలేకుండా వున్నా. యే సంబంధం తీసుకొచ్చినా యేదో వంక పెడతావాయె. నిన్ను చూసి పిల్లా అపలుకే పలుకుతుంది. పైవారితే వాడిని నామాటేం సాగుతుంది?

భార్య: మీరూ మీ అమ్మాయి మంచి వాళ్ళు! యెట్టొచ్చి నేనేగా చెడ్డాయింపు! అదికాదు తమ్ముడూ. ఈ మధ్యో సంబంధం తెచ్చారు; పిల్లవాడు నల్లగా దిసపుకోడిలా వుంటాడు. మా బంగారుతల్లికి మనసెట్టా వొప్పుతుంది? తల అడ్డంగా తిప్పింది. నేను దానిచేత 'ఊఁ' అనిపించలేదని వీరికోపం.

యజమాని: పిల్లవాడు నల్లగా వున్నా డంటే తండ్రి నల్లని నలుపు. తల్లిమాత్రం పచ్చి పసుపుకొమ్ములా పచ్చనిపసిమి. పొంపకు పారెడుకళ్ళు; కోటేరేసినట్టు ముక్కు......

భార్య: పిల్లవాడినిచూశా, తల్లినిచూశా పిల్లనిచ్చేది? ఆ సంబంధం అయితే వియ్యపురాలికళ్ళు, ముక్కు చూస్తూ వొళ్ళుమరిచే వాళ్లేమో మరి!

[గుసగుసా లోపలికి వెడుతుంది.]

యజమాని: ఆఁ! అదికాదోయ్! నేననటం, కనిముక్కుతీరు తల్లివొచ్చాయి; పోలిక తల్లి, రంగు తండ్రీను. తల్లినిబోలి పుడితే అదృష్టం కూడా అంటారు.

భార: [లోపలినుంచి] ఏమి అదృష్టమో! ఆ అబ్బాయి పుట్టాట్ట, వాళ్ల ఆస్తంతా హరించుకుపోయిందిట.

యజమాని: పుట్టటంవల్ల హరించుకు పోలేదు. పిల్లడికి పెద్దచదువులు చెప్పించారు. సీమకుపంపి యింజనీరు చదివించారు. అయినా ఆ ఆస్తంతా కట్టకుంది మునమేగా! అందులో అయిదోవొంతుండదు వాళ్లు కట్నం అడిగింది.

మిత్రుడు: మనదేశంనుంచి నల్లవాళ్ళు

సీమకు చదువుకోటానికి వెడితే పెందరాళే పిల్ల కోరినడిగ్రీ యిచ్చి పంపుతారట, యీలోపునం అక్కడ యెక్కడ పడుతుందో అనే భయంతో.

భార్య : [త్వరత్వరగా వచ్చి మాట అందుకుని] నా భయమూ అదే! ఆయన తండ్రికి ఆయనలానే, ఆయనకు ఆయన పిల్లలూనూ, ఎలికలూ యెలుగ్గొడ్లూ. కట్నం దండని కన్నపిల్లను కడతామా యే కొయ్యకు పడితే ఆకొయ్యకు ?

యజమాని : ఏదోవొకటి ! కొదుకున్నాం. అయిపోయిందిగా ! యింకెందుకే హైరాను పడతావు ?

మిత్రుడు : నువ్వు యెన్నైనా చెప్పు బావా! మొగవాళ్ళది యెంతసేపూ అర్ధదృష్టి.

యజమాని : ఆడవాళ్ళది ? శూన్యదృష్టి! వాళ్ళకళ్ళతో చూస్తే పెళ్ళిళ్ళు నిర్వాకం చేసినట్టే !

భార్య : కాకపోతే, పాటపాడించినా అక్షరంముక్క లేని కోతికో కొండముచ్చుకో కోటూబూటూ తగిలించి, యేం లేకపోయినా పోలెడాస్తుంది, కట్టుకో మంటే యేపిల్ల కట్టుకుంటుందండీ యీ రోజుల్లో ?

యజమాని : నేనట్టా యెన్నడన్నా అన్నానుటే ? ఆమాట లెక్కడ్నుం చొస్తున్నయ్యి, నోట్లోంచా కడుపులోంచే?

భార్య: మీ రనకపోతే మీ తమ్ముడుగారాయిరి. మొగవాళ్ల తీరు చెబుతున్నా.

యజమాని: ఏమిటే! నా పిల్ల పెళ్ళిసంగతి నా తమ్ముడుకేమంత అవసరమొచ్చిందీ అంట, పట్టించుకోటానికి?

భార్య: అయ్యో! అంత సౌభాగ్యం కూడానా! మనమ్మాయి సంగతి కాదు వారి పిల్ల విషయంలోనే.

యజమాని: ఏమిటేమిటే! యీ నాలుగు నాళ్ల మధ్య యేదన్నా మనువు తెచ్చాడా యేం? హైదరాబాద సంబంధం వెనక్కి పోయిందట?

భార్య: ఆబాధ యెప్పుడో వొదిలింది. నిన్న కాక మొన్నడండీ! పిల్లను చూట్టానికో పిల్లవాడు, ఆ అబ్బాయి అప్ప మొగుడూ వచ్చారుట.

మిత్రుడు: ఆసంగతి నాకు తెలియదే! వూళ్లో నేవున్నా. నాకు తెలియకపోతే యేంగాని ముఖ్యంగా యెవరికి తెలియకుండా వుండాలని వాళ్లు కోరుకుంటారో ముందు వాళ్లకే తెలిసిపోతోంది.

భార్య: తెలిస్తే మాత్రం మేమేమీ పోటీలకు పోకూడాలేదు. మరిదిగారు తెచ్చే అంతోటి గొప్ప సంబంధాలకు.

యజమాని: ఏదో! వాడి తాహతువాడిది. కొసకి యేమైంది? పిల్లనచ్చలేదా యేమిటి?

భార్య: నచ్చకపోవటానికి పిల్లకేమండీ? కొంచెం పళ్ళెత్తతే మాత్రం. వాళ్ల అమ్మ పోలిక. అక్కడికేనయం, పొంతం రాలేదు.

యజమాని: తోడికోడలు అనాకారని తను అప్సరసనని దీని కదో గర్వం. మొత్తానికి పోనిచ్చావు కాదే!

భార్య: పరేలెద్దరూ! అసలు సంగతి వినండి!, మీ మరదలు గడుసుదనం. చూడొచ్చిన వాళ్ళు మామూలుగా అంతా అడిగే ప్రశ్నలన్నీ వేశారు. సంగీతం వొచ్చా? చదువొచ్చా? యెందాకా చదివింది? యిట్లాంటివి. పిల్లవాడి చేతులో వున్న పత్రికముందు పడేసి చదవమన్నారుట. గడగడా చదివేసింది. చివరకు అటూ యిటూ నడవమన్నారుట. మరేం చేస్తారు, "నడమ్మ" అన్నారుట మరిదిగారు.

మిత్రుడు : వచ్చిన ప్రతివాడూ యీ కవాతులన్నీ చేయిస్తుంటే తల్లిదండ్రుల మాటేమోగాని పైన చూసే నాబోటిగాడికే అరికాలిమంట నెత్తికొస్తుంది.

యజమాని : నీకేం తెలుస్తుందోయ్! అదృష్టవంతుడివి. ఆ పుట్టిన్నలుగురూ మొగ కూనలేగాని ఆడనలుసు పడలేదు.

భార్య : అప్పుడే యేమైంది? పురిటి కెళ్ళిందిగా మా మరదలు! ఆపళంగా మీ మరద లేంచేసిందో చూశారా! నాకుమల్లే గుడ్లప్పచెప్పి కూర్చోలా. "నాయనా! ఆపేపరు నువ్వు కొస్త చదివ్వినిపించమందిట. యింకేముంది! అప్ప మొగుడు మొఖం తిప్పేశాడు; అబ్బాయి గుడింతాలు నెమరెయ్యడం మొదలెట్టాడు. మరిదిగారు భార్య వేపు గుడ్లు రిమార్చి! అంతటితో వూరుకో వచ్చా? "పోనీ పెళ్లామైనా చదువుకు నుంటే మంచిదే" అని, చర్రున, పిల్ల చెయ్యిచ్చుకుని, లోపలికి తీసుకుపోయిందిట. [భర్త ఆనేమాటలు వింటూ ముసి ముసి నవ్వు నవ్వుతూ లోపలికి వెడుతుంది.]

యజమాని : కళ్లుకాదు, వాడి మొఖం వురిమాడు రోతు మెత్తనైతేసరి!

మిత్రుడు : ఏం బావా! ఆడవాళ్ళంటే చెంబు తప్పాలాలంటి వస్తువు లనుకుంటున్నావుగామల్లే. నువ్వింకా పాతరం వెనకున్నావు. ఆడవాళ్ళకు మొగవాళ్ళతో పాటు సమానమైన హక్కులు కల్పిస్తోంది మన ప్రభుత్వం.

యజమాని : అట్లాగే కల్పిస్తుంది! నీబోటి యిచ్చకంగాళ్ళు అధికారంలో వుంటేసరి.

భార్య : [వెండిపళ్లెం పమిటచెంగుతో తుడుస్తూ లోపలినుంచి వచ్చి] వంటైందండీ! యింకా ఆలస్యం చెయ్యటం యెందుకు? లేచి స్నానం చెయ్యండి; మీకు నీళ్లు తోడా.

యజమాని : అంతా నాకు నీళ్లతోడేనా? ఇంత పొద్దుపోయిందే, పొయిలు వెళ్లిందికూడాను, పిల్ల యింటికొచ్చిందేమో చూడు! యిట్లా వుంది. నీ పెంపకం! మరీ హద్దు మీరిపోతోంది!

భార్య : బాగుందండోయ్! పిల్ల నేమీ అనలేరు మళ్లీ! అసలు మీ అబ్బురంవల్లే దానికి నా మాటంటే బొత్తిగా లక్ష్యం లేకుండా పోయింది. వెనకాల వస్తోందనుకున్నా. సావిత్రితో వాళ్ళింటి కెళుతుందని నేనేం కలగన్నానా?

మిత్రుడు : పిచ్చాపాటి మాట్లాడుకుంటూ కూర్చుంటే మనకు టైము తెలిసిందీ? ఆ పిల్లా కాపరాని కెళ్ళాక యిదేగాఢల్లు పుట్టింటికి రావటం? సమవయస్కులు, బాల్యస్నేహితులు; ముచ్చట్లాడుకుంటూ కూర్చునుంటారు. పోనీ, నేను పోయి పిలుచుకొస్తా. నువ్వీ లోపల స్నానంచేస్తూ వుండు, బావా!

యజమాని : నువ్వెందుకు లేవోయ్! నేనే వెడతాను.

భార్య : మీ రెందుకండీ! పొద్దుటినుంచి భోజనం లేకుండా తిరిగి తిరిగొచ్చారు. నీళ్లు చల్లారిపోతె కూడా. మనుళ్ళు గాని పనికి రావు మళ్ళా!

యజ: సరే! వెళ్లి రావోయ్! వొకళ్ళు వెళ్లి పిలుచుకొస్తే గాని యిల్లు పట్టకపోతే యెట్లాగంటి? పొద్దుపోయిన గమనమన్నా లేకుండా! మరీ కృతిమించులోంది! (స్నానానికి వెడతాడు. భార్యకూడా వెడుతుంది. మిత్రుడు సావిత్రియింటికి బయలుదేరుతాడు. ఇంతలో మెయిల్ రన్నరు జేబులో నుంచి వుత్తరం తీస్తూ వచ్చి)

రన్నరు : ఏమండోయ్!

మిత్రుడు: ఏమోయ్! యిట్లా వచ్చావు?

ఒక భీమా ఏజంటు డైరీనుండి

# ఆమెకు నేను దేవదూతగా కనబడ్డాను. . .

ఆమె అక్కడ కూర్చొని వుంది—లక్ష్మీబాయి, ఆమె ముగ్గురు బిడ్డలూనూ. ఆమె చుట్టూ నేలపై, విత్తులు తీయని ప్రత్తి చిందరవందరగా పడివుంది. ఇరుకుగావున్న ఆచిన్నగదిలోని అపరిశుభ్రత భరింప నశక్యంగావుంది.

నేను రాజకోటనుండి యింతదూరం యీ వితంతువును కలుసుకోడానికి వచ్చాను ఆమె భర్తయొక్క భీమా పాలసీకి సంబంధించిన వ్యవహారాలను కొన్నిటిని పరిష్కరించ వలసిన అవసర మేర్పడింది. ఎప్పుడైతే, నే నెవరినో, ఎందుకు వచ్చానో, చెప్పానో అప్పుడే ఆమె ముఖం కాంతివంతమై పోయింది. ఆమె దృక్కులు నేనొక దయామయుడనైన దేవతనో అన్నట్లు చూశాయి.

నట్టుగొట్టుతూవున్న మాటల్తో, ఆమె యీ విధంగా చెప్పసాగింది : ఆమె భర్త 3000 రూ లకు ఒక భీమా పాలసీ తీసుకున్నట్లున్నూ గడువు తీరిన అనంతరం ఆ సొమ్ముతో యిల్లు కట్టుకోవాలని, ఎంతో ఆశించి నట్లున్నూ చెప్పింది. కాని ఆయన దీర్ఘరోగంవలన వారు దాచి పెట్టుకున్న ఆఖరి పైసాతో సహా ఖర్చయి పోయింది. ఇక నిత్యావసరాలను ఏ విధంగా గడపాలి? పాపం ఆమె చేసేది లేక చివరకు రోజుకు 5 అణాల కూలికి ప్రత్తిమండి విత్తు తీసే పనిచేయడం సాగించింది.

కొన్ని మామూలు వ్యవహార తతంగాలన్నీ పూర్తిచేసిన తోడనే ఆమెకు భీమాద్వారా సంక్రమించవలసిన డబ్బు తప్పక వస్తుందని హామీ యిచ్చాను.

భీమా సంస్థకు సంబంధించిన మనిషి చాలా మంది స్నేహితులను కూర్చు కుంటాడు. కాని నిరాడంబరమైన యీ వితంతువూ ఆమె ముగ్గురు బిడ్డల ఆదరమూ, కృతజ్ఞతా, నాకు జీవిత భీమాలో పని చేయాలనే దృఢ సంకల్పం, ఆనందం గలుగ జేస్తాయి.



* ఇందులోని వ్యక్తుల భావాలకు భంగం కలుగ కుండా వుండటానికి యీ కథలోని పేర్లు వూహాకల్పితాలు. కాని కథ మాత్రం నిజమైనది.



## లైఫ్ ఇన్స్యూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

ASP-LIC-14

యజమాని: (బనీనుకూడా లేకుండా తుండుగుడ్డ కప్పుకుని ప్రవేశించి) ఎవరా వచ్చింది? నువ్వట్రా అబ్బాయి! పొద్దుపోయొచ్చావు? మీ నాయన పంపాడా? మీ నుము రాసి తయారైందేం? ఏమిటది! ఉత్తరమా! యెవరిచ్చారు? (భార్యకూడా లోపలినుంచి వస్తుంది.)

రన్నరు: మెయిల్కి టపా తీసికెళ్లాను. రైలు కదలబోతుండగా బండిలోంచి నొకరాయన్నన్ను పేరెట్టిపిలిచి, ఫలానావారి రైతు కొడుకువుకాదా అన్నాడు. అవునన్నాను. అయితే కొస్త యీ వుత్తర పట్టుకెళ్లి ఆయన గోరికివ్వు; వారింటో లేకపోతే వారిభార్య గోరికివ్వు అని యీ కవరిచ్చాడు.

యజ: (టేబులుదగ్గరకు వెళ్లి కళ్లజోడు తీసి తగిలించుకుంటూ) ఎవ్రాయనా? ఎన్నెళ్ళుంటై?

రన్నరు: పాతికేళ్లుంటయ్యో వుండవో. వస్తానండి, శలవిప్పించండి! (వెడతాడు)

యజ: (వుత్తరం విప్పి లోపల లోపల చదువుకో ప్రారంభిస్తాడు. కాని వెంటనే వెనక్కు తిప్పి సంతకం చూస్తాడు. మళ్లా మొదటినుంచి తనలో చదువుకోటం మొదలుపెడతాడు. వుత్తరంలోని విషయాల వల్ల కలిగే మనోవికారాలు ముఖంలో ప్రస్ఫుటం అవుతూ వుంటవి. విపరీత దుఃఖమూ, ఆత్మాభిమానం దెబ్బ తినటంవల్ల తెలియకుండా వచ్చే రోషమూ, హఠాత్తుగా సంభవించిన పరిణామ ఫలితంగా యేర్పడ్డ ఉద్రిక్తత యేకమై పొంగి పొర్లవస్తుంటే బలవంతాన ఆపుకుంటూ మతిపోయినవాడిలా కూర్చుంటాడు.)

భార్య: (గల్లంతు పడి) అయ్యో! ఏమిటండీ అది? యెవ్రాశారు? ఏముందండీ అందులో? చెప్పండీ!

యజ: (ఉత్తరం వున్న చెయ్యి భార్య వేపు జాపి చేష్టలుదక్కినట్టు వుంటాడు.)

భార్య: (ఉత్తరం తీసుకుని చదవబోయి) కంపెడు చత్వారంతో నేనేం చదువుతాను తమ్ముడూ! ఇదిగో చూడు.

మిత్రుడు: (చదువుతాడు) 'ప్రియమైన అమ్మకు నమస్కరించి'—

భార్య: ఆఁ! రాసిందెవరో చూడుముందు.

మిత్రుడు: 'ఇట్లు నీ ప్రియాతిప్రియమైన కూతురు శంప'—

భార్య: మా అమ్మాయా! శంపా! ఆ! చదువు! చదువు!

మిత్రుడు: 'నేను నీకు, నాన్నగారికీ, తాత్కాలికంగానైనా దుఃఖం కలిగించే విధంగా నడుచుకోవాలిసొచ్చినందుకు దురపిల్లుతున్నాను.'—

యజమాని: తాత్కాలికంగాయేం? శాశ్వతమే!

మిత్రుడు: 'తాత్కాలికంగాఅని ఎందుకంటున్నానంటే, నాచేసినపని సంప్రదాయ విరుద్ధంకాదనీ, బుధజనసమ్మతమైనదే ననీ ముందుముందు నిలకడమీద గ్రహించగలరని విశ్వసిస్తున్నాను. ఆవిశ్వాసమే యిప్పుడు నాకీధైర్యాన్ని యిచ్చింది.'—

యజమాని: ప్రజ్ఞ పేలాలైపట్టివుంది.

మిత్రుడు: 'మనసా ప్రేమించిన వారిని అనతికాలంలో వివాహమాడబోతున్నాను. యెవరికి తన హృదయాన్ని త్రికరణయా అర్పణచేసిందో వారికి భార్యయై దాసియై వర్తించుటేగదా భారతస్త్రీకి విధ్యుక్త ధర్మము! నే నాపురాణధర్మాన్ని పాటించి నావిధ్యుక్తవిధిని నిర్వహిస్తున్నాను. ఇవన్నీ నేను నీకువేరే చెప్పనక్కరలేదనుకుంటాను.'

యజమాని: నిజం!

మిత్రుడు: 'నేను యేమహామహుని పెండ్లాడబోతున్నానో వారి యూరుపేరులు మాత్రమిప్పుడు బయలుపరుపదలచలేదు. నీకిది హృదయశల్యముకావచ్చు. అట్లు కాకుండుటకు ఒక్క విషయముమటుకు వ్రాయుదును. ఎవ్వరి శుభాకారమీక్షింప యే ప్రొద్దు నాకన్ను లెదురుచూచునో, ఎవ్వరిగుణములు కర్ణేంద్రియంబులుసోక నా దేహతాపంబులు తీరిపోవునో, ఎవ్వరిలపన్నామ మనిశంబు భక్తి నామనసున మననంబుచేతునో, ఎవ్వరి చరణసేవ యేవేళనొనరింప యిలువెడలి నేనిప్పుడేగుచుంటినో అట్టి నా హృదయాధిదైవము విద్యారూపతారుణ్య సౌజన్య శ్రీ బలదానశౌర్య కరుణాసంశోభితులు.'—

యజమాని: ఎక్కడిపాండిత్యమే యిది! కొంపతీసింది!

మిత్రుడు: 'అయితేనేం. తండ్రిగారికి మాత్రము విరోధివర్గములోనివారు. వారికి నా మనోగతాభిప్రాయమును యెరుకపరచియుందునేని నన్ను కఠోరముగా దూషించి నా వాంఛాపరిపూర్తి కవరోధములు అన్నివిధముల కల్పించియుండెడివారు. అందుచే వారికి మనసులోని మాట చెప్పనైతిని. వారును పరుల వరులుగా నాకై అన్వేషించుచుండిరి. నా ప్రాణవల్లభుడు పురుషసింహము'.

యజమాని: వెధవ! గ్రామసింహం!

మిత్రుడు: 'సింహమునకు దక్కవలసిన నేను గోమాయువు పాలబడుటకిచ్చగింతునా? తండ్రిగారి తలంపు నే నెరిగిన దాననగుట, లోన నెంత ఆపన్నత నొందితినో నీకేమి తెలియును. చనవు కలదాననని నీకు నా యింగిత మెరిగించినను ప్రయోజన ముండదని నాకు తెలియును. నన్నుమ్యల కియ్యకుండ నాన్నగారిని వారించుశక్తి నీకెట్లునూ లేదు. అందులకే యీ సాహసము. నే చేసినది తప్పుకాదని నా అంతరాత్మ పదే పదే ఘోషించుచున్నది. నాన్నగారు, నీవు, నన్నల్లారుముద్దుగా పెంచితిరి. మీకు సర్వదా కృతజ్ఞురాలను. కాల మనుకూలించినప్పుడు నేను, నా భర్తగారు, మీ ఆశీర్వాదము కొరకు రాగలము.'

యజమాని: ఆశీర్వాదానికా? ఆస్తికోసమా? చిల్లిగవ్వ దక్కనివ్వను. దత్తత చేసుకుంటాను.

మిత్రుడు: 'అమ్మా! యింక శలవు. నాన్నగారికి నా ప్రేమపూర్వక నమస్కారములు అందచెయ్యి. మనమంతా కలుసుకోటానికనువైన సమయం త్వరలో వస్తుందని ఆశిస్తున్నాను. ఇట్లు నీ ప్రియాతిప్రియమైన కూతురు శంప'.

భార్య: ఎంత సాహసం చేశావే కూతురా! యిదంతా మాకర్మ.

యజమాని: (దుఃఖ రోషావేశాలతో) సిగ్గుమాలినపని! సాహసంటే యిది? సాహసం! యెందులోనన్నా పడి చావక పోయింది!

మిత్రుడు: పరాయివాళ్ళెదట తలెత్తి తిరిగరగదే యెప్పుడూ! నాతో మాట్లాడుతున్నా తలవొంచుకునే వుండేదికాదుటమ్మా? ఏవిఁటో! కాలప్రభావం!

యజమాని: కర్మప్రభావంకాదు, కాల ప్రభావంకాదు. ఆరాతమాస్తే తెలీటంలా! ఏ ప్రభావమో? ఎందుకే అట్టా చూస్తావు? నిన్నేమీ అనదలుచుకోలేదే అమ్మా! (లేచి నిమ్మళంగా యింటోకి వెడతాడు. భార్య, వెనకాలే, తలవంచుకు నడుస్తుంది. మిత్రుడు వారివంక జాలిగాచూస్తూ నుంచుంటాడు. తెరపడుతుంది.) ★

# ఆచార్య విభ్రాంతి

రాజనర్తకి కింశుకప్రభ వలయాకార మయూరనృత్యం తిలకించిన సభాస్తారుల హృదయాలన్నీ ఒక్క క్షణంలో క్రొక్కారు మెరుపులై పరుగులుపెట్టాయి!

అర్థరాత్రి. చైత్ర పూర్ణిమ వెన్నెల వెల్లువలో అమరుకదేవభూపతి రాజప్రాసాదమే ఒక రాజహంసలా మెరిసింది. ఆ మహీపతి కింశుకప్రభ నృత్యచాతుర్య భంగిమలన్నీ నిశ్చలదృష్టితో పరిశీలించాడు. ఆ ఆనంద తన్మయతలో క్రమక్రమంగా అతనికి మైమరపే కలిగింది.

రాజప్రాసాదం పై అంతస్తుపై అమర్చిన నృత్యమండపంలో రాజవల్లభులయిన సదస్యులందరిదృష్టీ క్రమక్రమంగా కింశుకప్రభ లలితహస్త విన్యాసలీలలో లీనమైపోయింది.

కింశుకప్రభ కాలిఅందెల సవ్వడి, మంద్ర మంద్రమైన వీణావేణుమృదంగ ధ్వని, నర్తకి వెనక నిలిచిన నట్టువరాండ్ర తాళ నిక్వాణాలు—అన్నీ ఒకే ఒక శ్రుతిగా మారుమోగి సదస్యులందరినీ నృత్య తన్మయతలో ముంచెత్తాయి.

అంతలో కింశుకప్రభ నృత్యం పరిసమాప్తమయింది. ముమ్మారు మారుమోగిన మద్దెల ముక్తాయింపుల సందడితో సదస్యులదంరు మళ్లీ ఈ లోకంలో పడ్డారు. వెనువెంటనే సాధువాదాలతో సభాపరిసరాలన్నీ మారుమోగాయి. ఆనాటి నృత్యభంగిమ లనేక విధాలుగా ప్రశంసిస్తూ సభ్యులంతా తిరిగి తమ భవనాలకు వెళ్లిపోయారు.

అమరుకదేవు డొక్క దీర్ఘనిశ్వాసం విడిచి లేచి నిలుచున్నాడు. కింశుకప్రభ వెనువెంటనే అతనిసన్నిధికి వెళ్లి కయిదండ ఇచ్చి నిలబడింది.

అత డంటీఅంటనట్టుగా ఆమె భుజం మీద చెయ్యివేసి తన శయ్యాగారంవైపు నడక సాగించాడు.

ఇంకొక నిమిషంలో వా రిద్దరు శయ్యాగారంలో ప్రవేశించారు. అమరుకదేవు డేదో పరధ్యానంగా ఆలోచిస్తూ తన హంసతూలికాతల్పంమీద మేను వాల్చాడు. కింశుకప్రభ అతనిపరసనే ఆశయ్యపై ఒయ్యారంగా కూర్చుని అతనివైపు తదేకదృష్టితో చూచింది.

అమరుకదేవుడు నిద్రిస్తున్నాడా? మేలుకునే ఉన్నాడా? ఆమె కాసందేహమే తీరలేదు! అత డర్ధనిమీలిత నేత్రాలతో ఏదో పరధ్యానంగా ఆలోచిస్తున్నట్టు కనిపించాడు. శయ్యాగారంలోని దీపకాంతి అతని అర్ధనిమీలిత నేత్రాంతాలపై ప్రసరించి తళతళ మెరిసింది.

ఒక దీర్ఘనిశ్వాసం ఆమె పెదవులనుండి వెలువడింది. కింశుకప్రభ తనపార్శ్వంలో ఉన్న మద్యపాత్ర నెమ్మదిగా అమరుకదేవుని పెదవుల కందించింది. అతడు రెండుమూడు గుక్కలు చవిచూచి మళ్ళీ అలాగే శయ్యపై మేనువాల్చాడు. కొంచెంసే పామెవైపుచూచి నెమ్మదిగా ప్రశ్నించాడు:

"నీ వెవరవు?" అత డామెవైపెంతో వింతగా చూచి అలాగే ఆశ్చర్యపోయాడు.

## ప్రాచీన గాథాలహరి

కింశుకప్రభ చెక్కిళ్ళపై కన్నీటిబిందువు లొకటొకటిగా దిగజారాయి. కంఠస్వరం గద్గదభారంతో తొణికిసలాడింది.

"అంతటి గాఢానురాగమే ఈనాటి కీవిధంగా మారిపోయిందే! ఇక నే నెవరినో మీకు తెలుపుకుచేస్తేమాత్రం ప్రయోజనమేమిటి?"

అమరుకదేవు డామెవైపలాగే రెప్పపాటు లేకుండా చూచాడు. ఆమె మళ్ళీ చెప్పింది: "నాపేరు కింశుకప్రభ! ఇప్పటికైనా జ్ఞాపకం వచ్చిందా? నన్నీవిధంగా విస్మరించడం తమకు ధర్మమేనా?"

"కింశుకప్రభా! ఎవరు? నీవా? ఇంతగా మారిపోయా వేమి? నిన్ను తిన్నగా గుర్తించలేకపోయానుసుమా!"

అమరుకదేవభూపతి నిద్రాభారసూచకంగా, లీలగా ఆవలించాడు. కింశుకప్రభ అది గ్రహించింది. దానితో ఆమె ఆత్మాభిమానానికొక పెద్దదెబ్బ తగిలింది:

"నిరంతర నృత్యగాన వినోదాలతో తామెంతో అలిసినట్టున్నారు. సెలవైతే తిరిగీ మరిఒకమారు తమదర్శనం చేసుకుంటాను. పాదదాసివిషయం ఈమాత్రమైనా జ్ఞప్తికిరావడం నిజంగా నా పూర్వజన్మ పుణ్యవిశేష ఫలితమే!"

కింశుకప్రభ తన కన్నీ రతనికి కనబడనీయకుండా ముఖం మరిఒకపక్కకుతిప్పివేసి నెమ్మదిగా అక్కడినించి వెళ్లిపోయింది.

అమరుకదేవు డెన్నో విధాల ఆమెవిషయం జ్ఞాపకంచేసుకోవాలని ప్రయత్నించాడు. ఎంతసేపటికీ అతని కామెవిషయమే స్మరణకు రాలేదు!

"శేషంతఃపుర పరిచారికల నెవరినైనా ప్రశ్నిస్తే ఈ విషయం ఇట్టే తేలిపోతుంది! దీనికోసం ఇంతమథన ఎందుకు?"

అని లోలోపలే సమాధానపడ్డాడు. కాని అతని వాజిజ్ఞాస అలాగే వుండుసలిపినట్టు సలిపింది. కాని ఎంతసేపటికీ అతని కా విషయం అంతు దొరకలేదు.

కింశుకప్రభ ఆనాడు నృత్యంచేసిన నర్తకీమణులందరికన్న రూపసి. నృత్యగాన విద్యలలో సాటిలేని నెరజాణ. నృత్యావసానంలో అతనికి కయిదండ ఇచ్చేమిషతో తనకుతానై కోరివచ్చి అతనిదగ్గర తన గోడంతా వెళ్లబోసుకుంది. అయినా అతని కామె ఎవరో గుర్తుకు రాలేదు!

అమరుకదేవుడు మద్యపాత్రలో మిగిలిన మద్యం అంతా ఒక చుక్కైనా మిగలకుండా ఒక్క గుక్కలో తాగివేసి, మళ్ళీ జిజ్ఞాసలో పడ్డాడు. అతనికేమీ గుర్తురాలేదు.

అతని దృష్టి పక్కనే తెరిచిఉన్న గవాక్షంగుండా విశాలానగరంవైపు తిరిగింది. నగర రాజవీథులన్నీ పాలవెన్నెల వెల్లువలో తలమునకలైనాయి. ఆ అతిలోకసౌందర్యం నిశ్చల దృష్టితో చూచిన అతనికి మరి కొంతసేపటికి కొంచెం మగత నిద్ర పట్టింది. ఇంకా కొంత సేపటికి గాఢనిద్రాభారంలో మైమరిచిన అతని నేత్రాలప్రయత్నంగా మూసుకొన్నాయి. సన్నని

పి. గణపతిశాస్త్రి



అగరుధూమమాలిక శయ్యాగారం అంతా వ్యాపించి అల్లిబిల్లిగా అల్లుకొన్నాయి. అమరుకదేవుని నిద్రాముద్రిత హృదయంలో చిత్రవిచిత్రమైనకలలనెమళ్లెన్నో రంగురంగుల పురులువిప్పి మైమరిచి నృత్యం చేశాయి.

౨

కొవడాని కది అమరుకదేవుని రహస్య మంత్రాగారమే. అయినా అతడా మంత్రాగారంలో వీణావాద్యంతో వినోదిస్తు న్నాడు. ఆ సమయంలో మంత్రులెవరు అతని సన్నిధికి రావడానికి సాహసించరు. అయితే మహామాత్యుడు రాజ్యవర్ధనుని కతని సన్నిధికి వచ్చి అత్యవసర రాజ్యకార్యమేదో నివేదించవలసిన అగత్యం ఏర్పడింది

రాజ్యవర్ధను డడుగుల సవ్వడి కాకుండా నెమ్మదిగా లోపలికివచ్చి అమరుకదేవుని సమీపంలో ఒక రత్నకంబళంమీద కూర్చున్నాడు. అగరుధూప ధూమమాలిక క్షణకాలం అమరుకదేవుని వీణ కలంకారమై నిలిచి నెమ్మది నెమ్మదిగా పైకెగసింది. మహామాత్యుడు కొంచెంసేపు వీణాగానం విని ఆనందిస్తున్నట్టు తల పంకించి, వేళ్ళ

 ఆచార్య విశ్రాంతి 

తాటించి పక్కా తాళం వేశాడు. కాని అతని హృదయం ఆ వీణాగానంమీద లేదని మహారాజు గ్రహించుకొన్నాడు. వెనువెంటనే వీణావాద్యం విరమించి, కొంచెం విసుగుదలతో బొమముడి విరిచాడు. మహామాత్యుడేవేవో రాజ్యకార్య వ్యవహారాలేకరువు పెట్టాడుగాని మహారాజవి తిన్నగా వినిపించుకోలేదు. పైగా వేరే ఇంకొక వ్యవహారం గుచ్చిగుచ్చి అడిగాడు:

"ఇంతకీ విదర్భ వ్యవహార మేమైనదీ? ఆ మాట చెప్పరేమి?"

"విదర్భాధీశ్వరులు తమకన్యకను మీకీయడాని కంగీకరించలేదు. అయితే స్వయంవర మహోత్సవం నిశ్చయించి మిమ్మల్ని ఆ మహోత్సవాని కాహ్వానించారు. అంతే!"

అమరుకదేవు డంతకన్నా రూక్షంగా బొమముడి విరిచాడు:

"ఐతే వెంటనే సైన్యాలన్నిటినీ స్వయంవర యాత్రకోసం సన్నాహపరచండి!"

అమరుకదేవుడు మళ్ళీ వీణావాద్యంలో మైమరచాడు. మహామాత్యుడు నెమ్మదిగా అడిగాడు:

"స్వయంవరోత్సవానికి సైన్యసంరంభం ఎందుకు మహాప్రభూ!"

"అదంతా మీ కనతికాలంలోనే తెలుస్తుంది! ముందుగా మన సైన్యాలన్నీ సమాయత్తపరచండి."

మహారాజిక మహామాత్యునివైపొక్కసారయినా కన్నెత్తిచూడలేదు. అతని వేళ్లు మళ్లీ వీణాతంత్రులపై నృత్యం ప్రారంభించాయి.

ఆ ఆజ్ఞవిని రాజ్యవర్ధనుడు దిగాలుపడిపోయాడు. అమరుకదేవు డెప్పుడు అతనితో సంప్రతించనిదే ఏవ్యవహారమూ తలపెట్టలేదు. ఈ మధ్యన అతనికి మహారాజదర్శనమే దుర్లభమైపోయింది. ఒకవేళ దర్శనం దొరికినా అమరుకదేవుడంతగా అతనితో ఆయా రాజ్యవ్యవహారాలు సంప్రతించడమే మానివేశాడు. అదంతా రాజ్యవర్ధనునికత్యద్భుతంగా కనిపించింది. అతడు మారుమాట చెప్పలేక వీణావాద్యం విని ఆనందిస్తూ పక్కతాళం వేస్తూ తలవంచుకొని మరికొంచెంసేపక్కడ కూర్చున్నాడు. ఇంకా మరికొంతసేపుండి మహారాజుదగ్గర సెలవుతీసుకునివెళ్లిపోయాడు. ఆనాడంతా అతని హృదయంలో మహారాజును గురించిన మథనే!

దానికి కారణాలు లేకపోలేదు. మాళవ రాజ్య సింహాసనం చేజిక్కించుకొన్నప్పటి నించీ అమరుకదేవుడెన్నడు అంత లోతుగా రాజ్యవ్యవహారాలలో జోక్యం కలిగించుకోలేదు. రాజ్యభారం అంతా రాజ్యవర్ధనునికి, మిగిలిన మంత్రులకు అప్పగించి నిత్యమూ భోగకలాలసలో మైమరిచి యథేచ్ఛగా సంచరించాడు.

పొద్దస్తమానమూ వీణా, వేణు మృదంగ వినోదాలు! ఆపైన నర్తకీమణుల లాస్యవిద్యావినోదాలు! ఆపైన అతనికి మద్యపానము, మృగయ, ద్యూతము మొదలైన దుర్వ్యసనాలు కూడా అలవడ్డాయి.

ఆ పరిస్థితులలో ఒకనా డతడు విశాలాపుర పరిసరాలలో సింహాలవేట కుపక్రమించాడు. అది అత్యంత ప్రమాదకరమైన మృగయావినోదం. ఒకనాడతడెన్నెన్నో సింహాలను సంహరించాడు. కాని ఆ సింహాలలో ఒక కొదమసింహం కూలప్రహారంచవిచూచిన వెంటనే అతనిపై ఉరికి పంజాలో శిరస్సుపై ఒక గట్టిదెబ్బ కొట్టింది. ఆ దెబ్బతో గుర్రంమీదకూర్చుని స్వారీచేస్తున్న అమరుకదేవుడు హఠాత్తుగా స్పృహతప్పి నేలమీద కూలబడిపోయాడు. మిగిలిన రౌతు లాసింహాన్ని వెంటనే సంహరించివేశారు. అమరుకదేవునికి కాయకష్టులా పరిచర్యలు చేశారు. కాని ఎంతసేపటికీ అతనికి తెలివిరాలేదు.

ఇక గత్యంతరంలేక నెమ్మదిగా అతనిని తిరిగీ రాజప్రాసాదానికి తీసుకుపోయారు. రాజవైద్యులెన్నెన్నో ప్రక్రియలు చెయ్యగా చెయ్యగా రెండుమూడు రోజులకతనికి కొంచెం తెలివివచ్చింది. ఇంకా కొంతకాలాని కతడు క్రమక్రమంగా కోలుకున్నాడు. అతని కప్పటికి పరిపూర్ణారోగ్యభాగ్యం కలిగింది.

కాని అప్పటినించీ అతనికి పూర్వపు రాజ్య వ్యవహారాలేవీ తిన్నగా గుర్తుకు రాలేదు. సింహంపంజాదెబ్బవల్ల అతనికొకవిధమైన విస్మృతి కలిగిందనీ, క్రమక్రమంగా ఆ మానసికవ్యాధి దానంతటదే నయమైపోగలదనీ రాజవైద్యులంతా కలిసి ఏకగ్రీవంగా నిశ్చయించారు. తిరిగీ కాయకష్టులా చికిత్సలు చేశారు.

మహారాజు మనస్సు చాలావరకు కుదటపడిందిగాని అతనికింకా సంపూర్ణస్మృతి కలగలేదు.

అయితే వేటనించి తిరిగివచ్చిన కొంతకాలానికతని వినోదవ్యాసంగం వేయిరెట్లెనుమడించింది. నిరంతర వారకాంతావ్యాసక్తి అతనికొక నిత్యకృత్యమై కూర్చుంది. నిత్యమూ మద్యపానమత్తతో మైమరిచిన అతని సన్నిధికి వెళ్ళడం, అంటే మహామాత్యునికికూడా కొంచెం సంకోచమే కలిగింది.

మహారాజు వివిధంగా నిరంతర భోగలాలసలో మైమరిచిమత్తెక్కిపోవడానికి కారణం ఎవరికీ తిన్నగా తెలియలేదు.

క్రమక్రమంగా అమరుకదేవుని వినోదవ్యాసంగం ఆనాటికానాడు బాగా పెచ్చుపెరిగిపోయింది గాని కొంచమైనా తగ్గుముఖం పట్టలేదు.

అమరుకదేవునికి సింహం పంజా దెబ్బతగిలి అప్పటికే ఒక సంవత్సరంపైగా గడిచిపోయింది. అయినా అతని నిత్యభోగ వినోదప్రసక్తి అలాగే ఇనుమడించింది గాని కొంచమైనా తగ్గలేదు.

అమరుకదేవుని అంతఃపురాంగనలు సుమారరవై మంది సుందరీ మణులు! ఇటీవల వారి సంఖ్య ఇంకా ఇనుమడించింది!

ఆపైన అతడు విదర్భదేశాధీశ్వరుని కుమార్తె లీలావతిని తనకిచ్చి వివాహం చేయ్యవలసిందని రాజదూతిద్వారా ఒక సందేశం పంపించాడు.

### 3

కింశుకప్రభ పూర్వం అమరుకదేవుని హృదయం చూరగొన్న ఒక విశాలాపుర నర్తకి. క్రమక్రమంగా అమరుకదేవుని అనురాగ కటాక్షవీక్షణంపడి ఆమె అతని అంతఃపురంలోనే ప్రవేశించింది. మరి కొన్నాళ్లవు తన లలితకళాచాతుర్యంతో అతని హృదయమే వశపరుచుకుంది. కాని అమరుకభూపతి వేటనించి తిరిగి వచ్చినప్పటినించీ మరి ఆమెమాటే తలపెట్టడం మానుకున్నాడు. అప్పటినించీ ఆమె తిరిగీ అతని హృదయమెలాగైనా చూరగొనాలని తహతహలాడింది. ఆనాటి రాత్రి నృత్యం ముగిసిన తరవాత ఆమె మళ్లీ అతని అనుగ్రహం సంపాదించి కొంతవరకు సంతృప్తి పడింది. అయితే అతని హృదయం పూర్తిగా తన గుప్పిట్లో పెట్టుకోవాలని ఆమె నొక గట్టిపట్టుదల పట్టుకుని పీడించింది.

కింశుకప్రభ తన పైటచెరగులో ఒక విచిత్ర వస్తువేదో దాచి ఇంకెవరికీ తెలియకుండా అతిరహస్యంగా అతని రహస్య మంత్రాగారంలో ప్రవేశించింది.

అప్పటికొక ఝాముర్రాత్రి గడిచింది. నిశ్చలంగా వెలిగే దీపకళిక వెలుగులో అమరుకదేవునిముఖం ఆనాడామెకెంతో మనోజ్ఞంగా కనిపించింది.

అప్పుడప్పుడు కొంచెం కొంచెం మద్యం చవిచూచి ఏదో తీవ్రాలోచనలోపడి సతమతమవుతున్నాడు. ఆమె రహస్య మంత్రాగారం ద్వారం కొంచెం తెరచి కొంతసేపటివరకు అతనిధోరణిఅంతా అతిజాగ్రత్తగాపరిశీలించి చూచింది. హఠాత్తుగా లోపలికివెళ్లి అతనికెదురుగా చతికిలపడింది:

"మీకొక అమూల్యరత్నం బహూకరిస్తాను! మరి నాకేమిస్తారు?"

అతడొక్క నవ్వునవ్వి ఆమె పైటచెరగులో దాచిన ఆ అమూల్యరత్నం హఠాత్తుగా చేజిక్కించుకోవాలని ప్రయత్నించాడు. కాని ఆమె అతనిఎత్తు సాగనివ్వలేదు. దానితో అతని ఆట కట్టింది:

"నీకంతకన్నా అమూల్యరత్నమే బహూకరిస్తున్నాను! తీసుకో!"

అని ఆమె పెదవులపై కెంపులపహరింగబోయాడు. ఆమె తటాలున తనముఖం ఇంకొకపక్కకు తిప్పివేసుకుంది. అంతలో అతడామె చెక్కిలి ముద్దు పెట్టుకొన్నాడు. ఆ ఆదరణకే కింశుకప్రభ ఎంతో మురిసి పోయింది. తన పైటచెరగులో దాచిన చిత్రఫలకం హఠాత్తుగా అతని ముందుంచింది.

అమరుకదేవుడు రెప్ప వాల్చకుండా ఆచిత్తరువు పరిశీలించాడు. అతనిముఖం వికసించింది. ఆ ముఖవికాసం చూచి కింశుక లోలోపల బాగా మథన పడింది.

అది విదర్భ దేశాధీశ్వరుని తనయ లీలావతి చిత్తరువు!

ఆ చిత్తరువుపై నిలిచిన అమరుకదేవుని దృష్టి మరి చలించలేదు! అతడు తదేక దృష్టితో ఆ చిత్తరువులోని చిత్తరివైపు చూచాడు:

"ఇంతటి జగదేకసుందరిని నేనింతకు పూర్వం ఎక్కడా కనీవినీ ఎరగనే!"

అప్రయత్నంగా వెలువడిన ఆ ప్రశస్తి వినగానే కింశుకప్రభ చెక్కిళ్లలో మోదుగపూ గుత్తులు వికసించాయి:

"సరికొత్తవారయితే సరి! మీ కెవరైనా అందగత్తెలే!"

కింశుకప్రభ అతని ఆదరణ కొంచం చవి చూచింది. దానితో బాగా కొండెక్కి కూర్చుని అదేపనిగా రుసరుసలాడడం మొదలుపెట్టింది.

అమరుకదేవుడామె నెన్నో విధాల లాలించి బుజగించాడు. ఆమె ఆ ఆదరణకు లోలోపల బాగా సంతోషించింది. అంతలో అతనిదృష్టి మళ్లీ లీలావతి చిత్తరువుమీదికి తిరిగింది. కింశుకప్రభ అది కనిపెట్టి హఠాత్తుగా అతని ఆశ్లేషబంధనం విడిపించుకొని ఒక్క దూకులో అక్కడినించి వెళ్లిపోయింది.

అమరుకదేవుని కామె ఈర్ష్యాసూయల ధోరణి అత్యంత విచిత్రంగా కనిపించింది.

కింశుకప్రభ అమరుకదేవుని కిటీవల లీలావతిపై మిక్కిలి మక్కువ కలిగిందని గ్రహించింది. తనమీద అతని అనురాగం ఇంకా ఇనుమడించాలని ఆశించింది. దానికోసం ఎంతో శ్రమపడి లీలావతి చిత్తరువొకటి సంపాదించి అతనికి బహూకరించింది. ఆ విధంగా అతని ఆదరాభిమానాలు చూరగొన్నానని బాగా మురిసిపోయింది. కాని ఆసమయంలో అతనిదృష్టి చిత్తరువు మీదికి తిరిగేసరికి పట్టరాని ఉక్రోషంతో అక్కడినించి లేచి వెళ్ళిపోయింది! ఆమెకు తనమీద కలిగిన గాఢానురాగానూయలు తెలుసుకొని అమరుకదేవు డామెమీద జాలి పడ్డాడు. కాని ఆ విషయమైనా గ్రహించకుండా ఒక్కక్షణంలో ఆమె అక్కడినించి వెళ్లిపోయింది!

అదంతా తలుచుకొని అతడొక వేడి నిట్టూర్పు విడిచిపెట్టాడు. ఆ పార్శ్వంలో కనిపించిన మద్యపాత్రికలోని మద్యం అంతా ఒక్క గుక్కలో తాగివేసి కింశుకప్రభ తనకు బహూకరించిన చిత్రఫలకం వైపు చూస్తూ కూర్చున్నాడు.

పిమ్మట ఒక అంతఃపురపరిచారిక అక్కడికి వచ్చి శిరస్సుపై దోసిలివొగ్గి సవినయంగా విన్నవించింది:

"మహాప్రభూ! ఇది భృగువాసర రాత్రి. ఈనాడు క్రమప్రకారం అంగరాజకుమారిక వారం! ద్యూతక్రీడలో కమలారాజ్ఞి యీరాత్రి గెలుచుకొన్న విషయం తమకు విదితమే గదా! ఇక తలకట్టుకుని కోప గృహంలోనికి వెంచేసిన దేవేరిగారు తమపై ఎంతైనా అలక వహించి వున్నారు! అది అత్యంత ముఖ్యమైన విషయమని నేను వేరే విన్నవించవలసిన అవసరమేమీ లేదుగదా! ఆపైన మరి దేవరవారి చిత్తం!"

ఆమె ఆనాటిరాత్రి అమరుకభూపతి ప్రత్యేకంగా సందర్శించవలసిన అంతఃపుర రాణుల పేరులన్నీ వరసగా ఏకరువుపెట్టింది. అతడొకసారి ఆమెవైపు చూచాడు. అంతఃపుర పరిచారిక వెంటనే వెళ్లిపోయింది.

అమరుకదేవుని కేవిధంగా నిశ్చయించడానికీ మనస్కరించలేదు.

అతని హృదయం అంతా అంతకు పూర్వమే లీలావతి చూరగొన్నది.

కాని దేవేరి నొకమారు సందర్శించకపోతే ఆమె మరి ఆ కోపగృహమే తన నిత్యనివాసంగా ఏర్పరుచుకోవచ్చును! మిగిలిన రాణుల విషయంలో దేవేరికన్నా మరి రెండాకులెక్కువే చదివారు!

క్షణకాలం అతడా రాణులందరిని గురించి ఆలోచించాడు. కాని అతని హృదయం వారిమీద ఎంతోసేపు నిలవలేదు.

ఈ తరక్షణంలో అతనిదృష్టి తిరిగి లీలావతి చిత్తరువుపై పడింది.

అలభ్యమైన ఆమె రూపరేఖలు తలుచుకొని తలుచుకొని అతడొక దీర్ఘనిశ్వాసం విడిచిపెట్టాడు.

స్మృతి తప్పిపోయేవరకు సీధుపానం చేసి ఆ మైమరుపులో అతడా రహస్య మంత్రాగారంలోనే, మేనువాల్చి నిద్రించాడు.

—సశేషం.

చెమట దుర్గంధమునకు, సామాన్య చర్మ వ్యాధులకు

వైజ్ఞానికంగా సరి క్రొత్తగా కనిపెట్టబడినది

# ఎక్టమర్

ఇప్పుడు భారతదేశమందు, సౌందర్యమునిచ్చు సబ్బులో నున్నది

చర్మ క్రిములను చంపునట్టి ఔషధములు, మంచివి, పెద్దవి, చాలా కాలమునుండియు తెలిసియున్నవే ... క్రొత్తదేమిటనగా, చాలా కాలము నిలవుండునట్టి గుణము గలది. అట్టి కనిపెట్టబడినది, మాన్ సెన్‌టోవారి 'ఎక్టమర్' (బైత్యోనాల్.)

ఈనాడు, మీరు భారతదేశమందు 'ఎక్టమర్'తోగూడిన టాయిలెట్ సబ్బును కొనగలరు: అది బ్రీజ్! ఆలోచించండి — మీరు ప్రతి రోజూ ఉపయోగించుచూ, బ్రీజ్‌ను 3 బిళ్లలవరకూ మాత్రమే వాడిన తరువాత మీ చర్మము దాదాపుగా క్రిమిరహితమైన దగును. మీరు క్రిమిరహితమైన చర్మమువల్ల ఏమి లాభమును పొందెదరో దిగువ వివరింపబడినది.

- చెమట దుర్గంధము తొలగింపబడును — చర్మ క్రిములు దానిని కలిగించును
- చర్మ వ్యాధులనుండి రక్షణ — ఈ క్రిములు సామాన్యమైనట్టి అనేక చర్మ వ్యాధులను గలిగించును.

మీరు బ్రీజ్‌ను ఇష్టపడెదరు — దీని విషయంలో కొంత ఎక్కువ ప్రత్యేకత గలదు. ఇది పరిమళమైనట్టి, శమనకరమైన, సౌందర్యమునిచ్చు సబ్బు. ఇది చర్మమును కాపాడునట్టి 'ఎక్టమర్'ను గలిగియున్నది. బ్రీజ్ ఇతర సబ్బులకంటె కొంచెమే ఎక్కువ ఖరీదుండును. మీరు దీనిని చాలా కాలము వరకూ ఉపయోగించుకొనవచ్చును.

నేడే బ్రీజ్‌ను కొనుడు




## బ్రీజ్

టాయిలెట్ సబ్బు

'ఎక్టమర్'ను గలిగియున్నది

ఈ సౌందర్యమునిచ్చు సబ్బు ప్రత్యేకమైనది — అది బ్రీజ్

లీవర్ బ్రదర్స్ లిమిటెడ్: లండన్, వారి తరపున భారతదేశంలో తయారుచేయబడినది

BZ. 4-366 TL

# పెళ్ళెందుకు?

ప్రియమైన కుసుమకి, 4-4-'56;

నేను శ్రీమతిని కాబోతున్నానని తెలియజేయటానికెంతైనా సంతోషిస్తున్నాను. శుభలేఖకూడా పంపుతున్నాను. నీ కాశ్చర్యంగా ఉందిగదూ? అవును. నిన్ను ఒక్కసారిగా ఆశ్చర్యపర్చియాలనే యిన్నాళ్ళూ తెలీనివ్వలేదు. వరుడి వివరాలన్నీ శుభలేఖలో ఉన్నాయి. అతన్ని స్వయంగా చూశాను. ఫొటోకూడా ఇచ్చారు వాళ్లు. అది నీకు పంపుతున్నాను. ఎలా నచ్చింది వ్రాస్తావుగా? పెళ్ళికి రావటానికి రెడీగావుండు. ఇంకా కొంచెం టైముందిగా. మీ వూరు వచ్చినప్పుడు మీ అమ్మకీ వాళ్ళకీ చెప్తాను. సిద్ధంగావుండూ? వస్తా. నీపెళ్లెప్పుడో మరి!

నీ

పద్మ.

* * *

హల్లో పద్మా... 7-4-56;

నీలేఖ చూచి స్తంభించిపోయాననుకో. నీవు శ్రీమతివి కాబోతున్నందు కెంతైనా చింతిస్తున్నాను. నీ కీ బుద్ధెందుకు పుట్టిందోనని చాలా ఆశ్చర్యంగావుంది. అసలు పెళ్ళెందుకు? పోనీ చేసుకుంటేమట్టుకూ, యింత తొందరెందుకు? హాయిగా, స్వేచ్ఛగా బ్రతికే బ్రతుకుని పంజరంలో పెడ్తున్నావా పద్మా? పెళ్లంటే నీకేదో సర్దాగా ఉందిగాని, ఎంత కష్టంగా ఉంటుందో! తెలీని వాతావరణంలో, తెలీని మనిషితో, జీవితాంతం గడపటం ఎంత కష్టం! ఇద్దరి ఆశయాలూ ఒకటిగాకపోవచ్చు. ఏమో బాబూ, నువ్వా వూబిలో కెందుకు దిగాలనుకొంటున్నావో? స్వేచ్ఛనేది వుండదుగదా. అంతా ఐపోయాక, ఇక నీకెన్ని చెప్తేమాత్రం ప్రయోజనమేమిటి? తర్వాత నీకే తెలుస్తుందిలే-పెళ్లైతే ఎక్కడికో వెళ్ళిపోతావ్. ఎప్పటిలాగే మా వూరు రావటానికి వీలుపడుతుందా? మీవారి దయ. ఇక మనస్నేహం వృద్ధిపొందదేమోనని భయంగావుంది. నన్ను కాస్త జ్ఞాపకం ఉంచుకోసుమీ -వరుడి రూపురేఖలు, పరిస్థితులు నాకు నచ్చాయి. గుడ్డిలో మెల్లలా, పెళ్ళిచేసుకుంటున్నా, మంచివాణ్నే ఏరుకుంటున్నందుకుమాత్రం సంతోషంగా వుంది. ఇక నీపెళ్ళికి నేను రావటం, రాకపోవటం అన్నప్రశ్నే లేదు. నాలుగురోజులుండనగానే వస్తా. ఈమధ్య ఓసారి రా-నాలేఖనిబట్టి నా పెళ్లెప్పుడో నిర్ణయించుకో గలవ్‌గా? ఉంటా-టా-టా

నీ

కుసుమ.

* * *

కుసుమా! 10-4-56;

నీ లేఖ పూర్తిగా అర్థంచేసుకొన్నాను. నాకు నవ్వొచ్చింది. నీ పిరికిరూపాన్ని వూహించగలిగాను. నేను నీకులా, పెళ్ళిని గూర్చి తలపోసేవాళ్లనేకమంది వున్నారు. పెళ్ళి చేసుకోవటమంటే వూబిలోకి దిగటమనీ, స్వేచ్ఛని పోగొట్టుకొని ఇతరుల దయమీద బ్రతకటమనీ నీలాంటివాళ్లు వూహిస్తున్నారు. కాని,అది నిజంకాదు. పెళ్ళి కేవలం శారీరకానందంకోసం కాదు - జీవితాంతం వరకూ దంపతులు ఒకరికొకరు అండ. చూడూ...నీ విషయాలు నాకూ— నా విషయాలు నీకు చెప్పుకుంటున్నాం.

## దద్దనాల రంగనాయకమ్మ

అలాగాకుండా, మనసులోవి ఎవరికీ చెప్పకుండా వుండగలమా? జీవిత భాగస్వామిస్థానం యింకా ఎక్కువ. ఎక్కడా మార్పులేని, ఒంటరిజీవితం గడపటంలో, ఏదో తెలీని, బాధ, ఆవేదన, వుంటాయి. ఎంతో లోటున్నట్లుగా ఫీలవుతాం. ఓ ఫ్రెండు కావాలనిపిస్తుంది. (నీలాంటి ఫ్రెండు కాదు)-సంబంధం కలిశాక పరాయివాళ్లలా అవుతారు? ఇద్దరి ఆశయాలూ కలవకపోతే పోనీ, ఎవరిష్టం వారిదే. ఒకర్నొకరు, గౌరవించి, ప్రేమించుకొంటే చాలు-పెళ్లికి ముఖ్యకారణం, యింకోటేమిటంటే, మనని జీవితాంతం ఎవరు పోషిస్తారు? మనకంటే పెద్దవాళ్ళైన తల్లిదండ్రులు మన జీవితాంతంవరకూ బ్రతకరుగదా? అన్నలూ, తమ్ముళ్లూ చూస్తారనుకోవటం చాలా పొరపాటు. మనమీద యివ్వాళున్నప్రేమ, రేపు లేకపోవచ్చు. మనం కేవలం జీవచ్ఛవాల్లా బ్రతకం. ఎన్నో అవసరాలుంటాయి. రాను, రాను వాళ్లకి భారమౌతాము. కుసుమా! ఇక, యింకో కారణం. కాటా, చెయ్యా వున్నప్పుడెలాగో కాలం వెళ్లబుచ్చగలిగినా, ముసలితనంలో సేవచెయ్యటానికి తప్పకుండా పిల్లలుండాలి. ఈవిధంగా ఆలోచిస్తే పెళ్లికిగల ప్రాముఖ్యం తెలుస్తుంది. పెళ్లితోబాటు స్వేచ్ఛనశిస్తుందనుకోకు. స్త్రీకితనగృహంలో వుండే స్వేచ్ఛకంటే, యితరత్రా ఎక్కువ స్వేచ్ఛ వుంటుందనుకోకు. దంపతులు కేవలం సహచరులు. ఎవ్వరూ యజమానులూగారు-దాసీలూగారు-తెలిసిందా? పిచ్చివేషాలు మాని, నీవుకూడా గృహిణివవ్వు-వివాహానంతరం మన స్నేహంపోతుందనుకోవటంకూడా చాలా పొరపాటే-వరుడి రూపురేఖలికి వంగనామాలు పెట్టకుండా వదిలినందుకు థేంక్స్. జవాబు వ్రాస్తావుగా—

పద్మ.

* * *

డియర్ పద్మా... 15-4-57;

నీ లేఖతో చాలావరకూ ఏకీభవిస్తున్నాను. కాని నా విషయంలోమట్టుకు, నువ్వూహించినంత ఘోరంలేదు. బ్రతుకుతెరువు లేనివాళ్లూ, మొగవాడి స్నేహంకోసం అలమటించిపోయేవాళ్లూ పెళ్ళిచేసుకోవాలేమోలే. కానీ, నాకోగొడవ, బాదరబందీ లేదు. మా అమ్మా నాన్నా నాకు ఆస్తి ఇస్తారు. అన్నిటికంటే ముఖ్యం మా అన్నయ్య ప్రేమ. నేనంటే ఎంతిష్టమో వాడికి! నువ్వూ చూశావుగా? నన్ను చులకనగా, భారంగా చూస్తాడంటే ఎలా నమ్మను? ఈమధ్య రేడియోగ్రాంకొన్నాం. హాయిగా, కాలుమీద కాలేసుకొని, పాటలు వింటూ, పుస్తకాలు చదువుకొంటూ, సినిమాలు చూస్తోంటే ఎందుకు జరగదు కాలం? నిర్విచారంగా సాగిపోతుంది మొయిల్లా. వ్రాయటం మరిచా. మా వదిన అబ్బాయి నెత్తుకొని వచ్చింది. వారంరోజులవుతుందిలే. చాల మంచిది పద్మా. నన్ను చాలాగౌరవంగా చూస్తుంది. నాకు సర్దాగా గడిచిపోతోంది-పెళ్ళైనా నన్ను మర్చిపోనని వ్రాసినందుకు సంతోషం. త్వరలో నువ్వు కూడా నీ స్వర్గసీమలో పడిపోతావుగా. మరి సంసారమంటే స్వర్గమనేగా నీ వుద్దేశ్యం. మా యింటిపక్క

 

# పెళ్ళెందుకు?



సరోజిని సంసారం చూస్తోంటే జన్మజన్మాలకీ పెళ్ళొద్దురా అనిపిస్తోంది. సరేలే. నా పెళ్ళివిషయం మర్చిపో. ఇక నా లుగు రోజుల్లో వచ్చేస్తున్నానుగా. ఇల్లంతా పెళ్ళిపనుల్తో హడావిడిగా వుంటోంది గదూ? వస్తా.

శుక్రవారం సాయంత్రం కోచీకి స్టేషన్‌కి రా.

కుసుమ.

* * *

డియర్ కుసుమా... 25-4-56;

నా పెళ్ళికొచ్చి వెళ్ళాక ఉత్తరం వ్రాయలేదు. ఏమైనా సుస్తీగా వుంటోందా? నాజూబందగానే జవాబు వ్రాయి. నా సంగతి కొంచెం వ్రాస్తున్నాను. ఈమధ్య నా కార్యక్రమం మారింది. ఏమిటో, యిదివరకు ఎక్కడబడితే అక్కడ మందకొడిగా కూర్చుంటే సాగిపోయేది. కాని, ఈమధ్య ఏదో బాధ్యత మీదబడినట్లుగా వుంటోంది. ఆయనకి కాస్త కోపంజాస్తి. కాని, మళ్ళా తత్క్షణమే కరిగిపోతారు. నాకే ఆశ్చర్యం వేస్తుంటుంది. నీకు చెప్తే, "పెళ్ళి చేసుకొన్నావ్. బాధపడుతున్నావ్," అని వెక్కిరిస్తావేమోగానీ, యిది ఏమంత కష్టంగాదులే. కొత్త వాతావరణం కదూ, కాస్త బెట్టుగా వుంటుంది. అంతే. మొన్న నేంజరిగిందంటే, గాతమ్మకు ఆయన షర్టుమీద సిరాజల్లాను. అది చూచి ఆయన నన్ను కోప్పడ్డారు. నా తప్పేముంది? కొత్తల్లుడని ఏమేమో చేస్తుంటారు. తర్వాత "నాకు కోపం యెక్కువ పద్మా. నువ్వేం అనుకోకు" అని బతిమిలాడుతారు. పాపం నాకే జాలేస్తుంది. భర్త సద్గుణాన్ని భార్య అనుభవించేటప్పుడు దుర్గుణాన్ని మాత్రం ఎందుకనుభవించకూడదు, అని అనుకొంటాను. ఏమంటావే? ఏది ఏమైనా సంసారం సుఖంగా సాగిపోవాలంటే ఒకరినొకరు బాగా అర్థం చేసుకోవాలి. "పెళ్ళయ్యాక ఆడవాళ్ళంతా మొగుడిగొడవలే చెప్తారు" అంటారు చాలా మంది. కానీ, నువ్వు శ్రద్ధగా వినేదానివి వున్నావనే చెప్తున్నా. నీ విశేషాలతో త్వరగా జాబు వ్రాయి. అందర్నీ అడిగానని చెప్పు. మరిచా. నేను నెలాఖరులోగా అత్తవారింటికి వెళ్ళిపోతున్నాను. అందర్నీ విడిచి వెళ్ళటం బాధగానే వుంది.

నీ
పద్మ.

* * *

ప్రియమైన పద్మా... 30-4-56;

నేనీమధ్య ఉత్తరాలు వ్రాయకపోవటానికి కారణం మరేం లేదు. కాస్త బద్ధకంచావంతే. రానురాను సంసారసాగరములో పడిపోతున్నావన్నమాట. మీవారికింత కోపమా? ఐతే అప్పుడప్పుడూ మీవారి వేళ్ళరుచికూడా చూస్తున్నావన్నమాట. భేష్. పాపం నీ దవడమీద శ్రీవారి అయిదువేళ్ళూ అంటుకొంటే చూట్టానికెలాగుంటుందో సుమీ! అదే నీకు స్వర్గంకదూ!

నావిషయాలేమున్నాయిలే. తిని తిరగటమేగా. ఆఁ ఈమధ్య నాన్నకి యెంతో జబ్బుచేసింది. ఓరాత్రి బాగా భయపడిపోయాం. ప్రస్తుతం కాస్తబాగానే వున్నారనుకో. నో మోర్ న్యూస్.

కుసుమ.

* * *

పద్మా... 1-5-56;

క్రిందటి వుత్తరం యింకా నీకు అంది వుంటుందో! లేదో! అప్పుడే, యీ ఘోరం జరిగిపోయింది. క్షణంలో ఏంజరిగేది తెలీదు. అకస్మాత్తుగా నాన్నకి జబ్బెక్కువయిపోయింది. నేను దగ్గరగా కూర్చునే వున్నాను పద్మా. నాన్న చచ్చిపోయారు. అబ్బా ఎంతఘోరం! నా కా దృశ్యం కళ్ళకు కట్టినట్టుంది. నాన్నకోసం ఎంతగా ఏడిచానో! కాని నాన్న చేసినపనికి నాకు కొంచెం కోపంగావుంది. ఆస్తంతా అన్నయ్యకీ, నాకూ చెరిసగంగా ఇస్తానని చెప్పారుగదా ఇదివరకు? కాని, నాకు రెండు మేడలు వ్రాశారంతే. మిల్లూ, పొలాలూ అన్నీ అన్నయ్యకే వ్రాసేశారు. ఈ సంగతి నాన్న మంచంమీద వుండగానే ప్లీడర్ గారు చదివివినిపించారుమాకు. అన్నయ్య వాటాలోనే అమ్మకికూడా ఏదో వ్రాశారు. నాన్నని అడుగుదామనుకొన్నాను కాని, చావుబ్రతుకులమీద వున్న నాన్నని ఆస్తి కోసం వుక్కల్లా వత్తిడి చెయ్యటం, దెబ్బలాడుకోవటం ఏమి బావుంటుంది పద్మా? అయినా, అన్నయ్య నన్నన్యాయం చెయ్యడులే. నేనడక్కపోయినా నాన్నే చెప్పారు, "అమ్మా. నువ్వు ఒంటరిగా వుంటానంటున్నావు. నీకు రెండు మేడలు చాలు. అన్నయ్యకప్పుడే పిల్లలు బయలుదేరుతున్నారు. మిగిలిన ఆస్తి వాడికుండాలి" అన్నారు. నేను తలూపాను. కాని, పద్మా! ఓవిషయం. నేను పెళ్ళి చేసుకుంటే చేసుకొన్న తక్షణమే చెరిసగం యివ్వాలని వ్రాశారు. పెళ్ళికీ, నా ఆస్తికీ, లంకేమిటి చెప్పు? నేను నా యిష్టం వచ్చినట్టు చేసుకొంటాను. సగం నాకివ్వటం న్యాయంగాదా? ఈ మధ్య వంట్లో సుస్తిగా వుంటోంది. ఓసారి రాగలవా? బహుశా నీకు సాగదేమో మరి. పోనీలే. అత్తవారింటికెళ్ళే ముందు, తెలియజెయ్యి. అక్కడే డ్రాపిస్తావు గదూ?

కుసుమ.

* * *

ప్రియమైన కుసుమకి... 3-5-56;

నీ రెండు లేఖలూ చదివాను. నాకు చాల దుఃఖమొచ్చింది మీ నాన్న పోయినందుకు! ఏం చేస్తాం? లోకసహజమే గదా? నెమ్మదిగా విచారం మర్చిపో. నాన్న నీకు ఆస్తి పంచివ్వటంలో సబబుగానే ప్రవర్తించారు. ఒంటరిగానికి ముప్ఫైవేల విలువచేసే మేడలు చాలు. మీ అన్నయ్య తనవాటాలోదికూడా నీకిస్తాడనుకొంటున్నావా? పిచ్చిదానా! ఎంతిచ్చినా ఆఖరికి అన్నయ్యకే చెందాలిగా— నేను రాలేకపోతున్నాను. వచ్చే సోమవారము అత్తవారింటికెళ్తున్నా. ఇక అక్కడికే వ్రాయి. ఎడ్రసిస్తున్నా.

పద్మావతి.

* * *

పద్మా... 9-11-56;

అత్తవారింట్లో బాగానే వుంటోందా? ఓసారి చూట్టానికొస్తాలే. నా మేడలమీద నెలనెలా రెండువందల అరవై రూపాయలొస్తున్నాయి. అన్నయ్య నన్నే తీసుకోమన్నాడు. కాని, నేనేంచేసుకోను? ఎలా ఖర్చుపెట్టను? అందుకనే అన్నయ్యనే వాడుకోమన్నాను. నీ కార్యక్రమం మారినట్టే, నా దినచర్యకూడా మారింది. అన్నయ్యగారి పిల్లలపోషణ నాదే. వాళ్ళకు నీళ్ళుపొయ్యటమనీ, బట్టలెయ్యటమనీ, బడికి పంపించటమనీ, ఒకటేమిటి అంతా నేనేచూస్తున్నాను. అసలు మొదట్లో ఊసుపోవటానికి యీ కార్యక్రమం నేను చెయ్యటం మొదలెట్టాను. ఎప్పుడైనా బద్ధకించిగానీ, ఇంకో కారణంచేతగాని, వాళ్ళగొడవ నేనుచూడకపోతే, యిక మావదిన వాళ్ళని చూడదు సరిగదా, పైగా ఏదో చాకిరీ చేసేస్తున్నట్లుగొణుక్కుంటుంది. ఏమైనా అంటే మాఅన్నయ్య ఏమనుకొంటాడో అని భయపడతాను. నిజముగా మా వదిన చిత్రంగా మారిపోయింది. ఇదివరకున్న ప్రేమలేదు. అంతగా మాట్లాడదుకూడా. నీకు ఉత్తరంలో ఎంతని వ్రాయను? నాకెంతో బాధగా వున్నట్టుంది. కొన్నాళ్ళు నీదగ్గర కొచ్చేద్దామా అనిపిస్తోంది. మొన్న అన్నయ్య నాలుగుచీరలు తెస్తే, వదిన మూడు తీసుకొంది. ఒక్కటి నాకిస్తూ "నీకొకటి చాలుగా?" అంది. అదికూడా నా కొద్దన్నాను. నేను కొనుక్కోవాలంటే కొనుక్కోగలననుకో. కాని యెక్కడికక్కడ సరిపెట్టుకోమంటారు. మా అమ్మకూడా కాంతిలేనట్లుగానే కన్పడుతోంది. ఇంతవరకు లేని ఆవేదనేదో నాలో విర్రసుతోందని నా వుద్దేశం. డాక్టర్నడిగితే మానసికంగా బాధ వుండవచ్చునవీ,

కొన్నాళ్లు ఎక్కడికైనా వెళ్ళిరమ్మంటు న్నారు. ఇలావుంది పరిస్థితి. పదవతారీఖున నా ఇరవైయ్యవ పుట్టినరోజు. కాని జరుపు కోను.

నీ

స్నేహితురాలు "కుసుమ"

* * *

కుసుమా... 15-11-'56;

నీ లేఖ చదివి నీపరిస్థితి నర్థంచేసుకొన్నాను. నీలో తీరని అశాంతి రగుల్కొంటోంది. దానికి కారణం నీవంటరితనం. నేను చెప్పిన దానికన్నా, అనుభవ పూర్వకంగా తెలుసు కొంటున్నావు. నీ అందచందాలను చూచి ఆనందించే వ్యక్తి లేనప్పుడు, యిక అంద చందాలకు ప్రాముఖ్యం యివ్వటం అనవసర మని మీావదిన అభిప్రాయమై యుండొచ్చు. ఇప్పటికే నీ మనస్సిలా బాధపడిపోతోంటే యిక జీవితమంతా ఎలా గడుపుతావు? ఇది నీ వ్యక్తిగత సమస్య. నీకు వెన్నెల్లో నిం చుంటే ఏభావాలూ స్ఫురించవా? ఏదో లోటున్నట్లుగా లేదా? ఎక్కడో, ఎవరో కష్టపడ్డారని, భీష్మప్రతిజ్ఞ పట్టటంబావుండదు సుమా! బాగా ఆలోచించు.

పద్మ.

* * *

పద్మకి... 2-12-56;

పద్మా! నాకీ అభిప్రాయం ఏర్పడిన వెంటనే నీకీ వుత్తరం వ్రాస్తున్నాను. నేను తప్పకుండా పెళ్ళిచేసుకొంటాను. నాకిప్పు డెంతానందంగా వుందో! నేను తన చెప్పు చేతల్లో వుండాలని మావదిన వుద్దేశ్యం. మొన్నటిసారి నాకు వారంరోజులపాటు జ్వరం వచ్చింది. అసలు నాకు మందులూ అవీ అమ్మే ఇచ్చేదనుకో. అమ్మ ఏదైనా పనిమీాదవుంటే మందుకలిపి యివ్వటానికి వదిన విసుక్కునేది "నేనీచాకిరీ చెయ్యలేను. జీవితాంతం యీావిడికి చెయ్యమని నానొసట రాసిపడేశాడు దేవుడు" అని గొణుక్కునేది. అంత జ్వరంలోకూడా ఆవిడమాటలకి ఎంతగా ఏడుపొచ్చిందో! ఇప్పుడే యింత విసుక్కునేది, నేను ముసిలిదానినైతే, తన పిల్లల్ని చూడనిస్తుందా? పెళ్ళెందుకు? అని వాదించినందుకు చాలా సిగ్గుపడుతున్నాను. ఒంటరి జీవితానికి ఆనందంలేదు. నీకు చెప్ప కుండా వరుణ్ణికూడా నిర్ణయించుకున్నందుకు క్షమించాలి. ఇంకా అతన్ని అడగలేదనుకో. అన్నయ్యద్వారా అడిగిస్తాను. అతనెవరో తెలుసా? మన స్కూలు ఫైనల్ క్లాస్‌మేట్ "రాధానాథ్." ఇక్కడ ఒ కాఫీసులో క్లర్కుగా వున్నాడు. అతనికేమీ ఆస్తిలేదు. ఉన్నవాళ్ళిం ఉన్నవాళ్ళకే పెట్టేకంటే, ఒక లేనివాణ్ణి ధనవంతుణ్ణిచెయ్యటం మంచిది కాదంటావా? నీ అభిప్రాయము వ్రాయి. నువ్వు చాలా సంతోషిస్తావు గదూ.

కుసుం.

* * *

15-12-'56;

చిరంజీవి కుసుమని సుమంగళిగా దీవిస్తూ వ్రాసేది...

నీ పెళ్ళికోసం ఎదురుచూస్తున్న నాకు చల్లనివార్త చెప్పావు. వేరే నా అభి ప్రాయం ఏముంటుంది? త్వరలో శుభలేఖ పంపు. ధిక్కరించనంటే ఒకమాట చెప్తా. నేను తల్లిని కాబోతున్నాను. నాతో వియ్యం పొందుతావా? నీపెళ్లికి పదిరోజులు ముందుగా వస్తా. వుంటాను మరి.

పద్మావతి.



# అసంప్రేక్ష్యకారిత్వము... పంచతంత్రము ...అయిదవ భాగము


















... గేయరచన ...
నండూరి. రామమోహనరావు
బొమ్మలు.. బాపు


















# విశ్వనాథుడు

శింగంపల్లి అప్పారావు

పూర్వం కుంభకోణంలో రామప్పఅనే జోతిష్కుడుండేవాడు. అతను చిన్ననాటనే సర్వకళలనూ కూలంకషంగా అభ్యసించాడు. జ్యోతిశ్శాస్త్రమంటే అతనికెంతో మక్కువ. ఆ కారణం వల్ల విశేష పరిశ్రమచేసి అందులో పరిపూర్ణ పాండిత్యం సంపాదించాడు.

రాజాధిరాజు మొదలుకొని, నిరుపేద వరకు ఎవరువచ్చి చేయిజాపినా జ్యోతిషం చెప్పి పంపించేవాడు. కాని వారిచ్చే ధన ధాన్యాదులు నిరాకరించేవాడు! రామప్ప చెప్పినది వేదవాక్కు. దానికి తిరుగులేదు. అందువల్ల అతని పేరుప్రఖ్యాతులు విఖ్యాతి గాంచాయి. దానికి తగినట్లు అతనుమాత్రం కుబేరుడు కాలేకపోయాడు.

నిత్యం భిక్షాటనకు బయలుదేరేవాడు. రామప్పఅంటే ఊరివారికి యిష్టదైవసమానం కాబట్టి భిక్షపెట్టి అయినా అతని ఋణం తీర్చుకుందామని భిక్షవేసేవారు. తనకూ భార్యకూ సరిపడినభిక్ష లభించగానే రామప్ప యింటిముఖం పట్టేవాడు. పగలు మొదటిఝాముకరకువచ్చినవారికి జ్యోతిషం చెప్పడం, ఆతరువాత భిక్షకు వెళ్లడం రామప్ప నిత్యకృత్యం.

ఇది రామప్పభార్యకు కష్టమనిపించింది. ఏమండీ! దేశంలో మిమ్మల్ని మించిన జ్యోతిష శాస్త్రజ్ఞులు లేరు. మీరు తలచుకుంటే కనకవర్షం కురుస్తుంది. కష్టపడ వలసిన అగత్యంలేదు. చూస్తే మీరు చిల్లి గవ్వ పుచ్చుకోరు! మనకు పిల్లాజెల్లా కలిగితే ఎలాగండీ!” అన్నదావిడ.

రామప్ప నవ్వి “పిచ్చిదానా! నేను యితరులకు జ్యోతిషం చెబుతాను. ఎన్నడూ నా జాతకాన్ని చూడలేదనుకున్నావా! విను! మనకు ధనయోగంలేదు. మన జీవితాలు నిశ్చింతగా యిలాగే జరిగిపోతాయి. అదీగాక ప్రతిఫలం పుచ్చుకుంటే జ్యోతిష శాస్త్రంలో పటుత్వం పోతుంది. ఇక పిల్లాపీచూ సంగతి... మనకు యిప్పుడప్పుడే సంతానప్రాప్తి లేదు. మన అరవయ్యోఏట ఒక కుమారుడు పుట్టగలడు. కాని వాడు మనకు అక్కరకు రాకుండా పోతాడు” అంటూ చెప్పాడు.

కాలం గడిచిపోయింది! రామప్ప అరవయ్యోసంవత్సరంలోఅడుగుపెట్టాడు. అతని జ్యోతిషం ప్రకారం ఆ వృద్ధదంపతులకు ఒక కుమారుడు కలిగాడు. రామప్ప ముసలి హృదయం, కుమారుని చూసి ఎంతో సంతోషించింది. రామప్ప కుమారునికి విశ్వనాథుడని, నామకరణంచేసి, జాతకం వ్రాశాడు. కాని తీరా జాతకం చూడగానే రామప్పకు విచారం ముంచుకొచ్చింది. కారణం విశ్వనాథుడు అల్పాయుష్కుడు కావటమే! అంటే యిరవై సంవత్సరాలు నిండగానే విశ్వనాథుడు మరణిస్తాడని రామప్ప గ్రహించాడు. అయినా యీ విషయం భార్యకు చెప్పకుండా దాచాడు.

విశ్వనాథుడు పంచవర్షప్రాయుడు కాగానే రామప్ప కుర్రవాడికి అక్షరాభ్యాసం చేయించాడు. విశ్వనాథుడు దిన దిన ప్రవర్ధమానుడగుతున్నకొద్దీ అతని ముఖ వర్చస్సులో పవిత్ర బ్రాహ్మణతేజం ఉట్టిపడుతూండేది. చూచినవారు రామప్ప అదృష్టవంతుడనేవారు. రామప్ప విశ్వనాథుడికి వంశానుగతంగా వస్తున్న జ్యోతిషశాస్త్రాన్ని బోధించడం ప్రారంభించాడు.

విశ్వనాథుడు సూక్ష్మగ్రాహి కావటం వల, పదహారవయేడు రాగానే, జ్యోతిష శాస్త్రంలో పండితుడయ్యాడు. అతనుకూడ వచ్చినవారికి జ్యోతిషం చెప్పడం ప్రారంభించాడు. అదేమి చిత్రమో రానురాను రామప్ప చెప్పేజ్యోతిషంకన్నా విశ్వనాథుని జ్యోతిషంలోనే ప్రజలకు ఎక్కువ నమ్మకం కుదురుకొనసాగింది.

‘తన కన్నకుమారుడు తనకన్నా గొప్ప పండితుడు కాగలడు’ అని రామప్ప హృదయం పొంగిపోయేది కాని, విశ్వనాథుడు అల్పాయుష్కుడు అని జ్ఞప్తికిరాగానే రామప్ప హృదయం దడదడ కొట్టుకొనేది.

ఒకనాటి ప్రాతఃకాల సమయంలో రామప్ప భిక్షార్థం బయటకు వెళ్లాడు. విశ్వనాథుడు అరుగుపైకూర్చొని శాస్త్రాల్ని తిరగవేస్తున్నాడు. ఇంతలో ఆదేశపురాజు, గుర్రమెక్కి హడావిడిగా రామప్పయింటికి వచ్చాడు.

అలావచ్చి విశ్వనాథుణ్ణి చూసి “ఒరే అబ్బీ! రామప్పగారున్నారా!” అంటు ప్రశ్నించాడు.

విశ్వనాథుడు రాజుముఖంవేపు క్షణకాలం చూసి “మీరొక కార్యార్థమై యిక్కడకు వచ్చారుకదూ! కాని లాభం లేదు. మీరు తక్షణం రాజ్యం వదలిపోవడం మంచిది. అప్పుడే శత్రువులు ఉత్తరపు కోటను వశపరచుకొని లోనప్రవేశించారు! దీనికి మీరేమీ క్రుంగనవసరంలేదు. తిరిగి నాలుగు సంవత్సరముల అనంతరం, మీ రాజ్యం మళ్లా మీ హస్తగతమవుతుంది!” అన్నాడు.

రాజు విశ్వనాథుని మాటలకు ఆశ్చర్య చకితుడయ్యాడు. ఇంతలో భటుడొకడు పరుగునవచ్చి “మహాప్రభూ! శత్రువులు ఉత్తరపుకోటను చేజిక్కించుకున్నారు! పోరు ముమ్మరంగా సాగుతోంది. జయిస్తామనే ఆశలేదు.” అని చెప్పాడు.

వెంటనే రాజు గుర్రాన్ని దౌడుతీయించాడు.

అప్పుడే భిక్షాటనకుంచి తిరిగివచ్చిన రామప్ప విశ్వనాథుని మాటలువిని ఎంతో ఆశ్చర్యపోయాడు. వెంటనే దుఃఖం పొంగి పొర్లుకురాగాఏడుస్తూయింటిలోనికివెళ్లాడు. తండ్రి దుఃఖించడం విశ్వనాథుడు చూశాడు.

కారణమేమిటో తెలియక లోనికి వెళ్ళి “ఏమిటి నాన్నా! ఎందుకు కంట తడి పెట్టావు? ఏం జరిగింది!” అంటూ ప్రశ్నించాడు. రామప్ప భార్యకూడ అదే ప్రశ్న వేసింది.

రామప్పదుఃఖాన్ని దిగమింగి “నాయనా! నీవు నాకన్నా గొప్ప పండితుడవయావు. ఇంత చిన్నతనంలోనే భగవంతుడు నీకు గొప్ప మేధాశక్తిని ప్రసాదించాడు. కాని పూర్ణాయుర్దాయాన్ని ప్రసాదించలేకపోయాడు. నీవు యిరవై సంవత్సరాల అల్పాయుష్కుడవు. అది జ్ఞప్తికిరాగానే దుఃఖాన్ని ఆపుకొనలేక పోయాను.”అంటూ జాతకంతెచ్చి విశ్వనాథునిచేత పెట్టి భోరుమన్నాడు ముసలిరామప్ప.

విశ్వనాథుడు ఆత్రుతగా తన జాతకాన్ని తీసి గుణించి, లెక్కలుకట్టిచూశాడు!— నిజమే! తండ్రివ్రాసిన జాతకంలో పొరపాటు వుంటుందా!

‘తనుకూడ యదార్థ విషయాన్ని తండ్రికి చెపితే అతను యింకా కుమిలి కుమిలి ఆ బెంగతో మరణించవచ్చు! కనుక మాయోపాయం చేయాలి!” అనుకున్నాడు విశ్వనాథుడు.

వెంటనే “ఏమిటి నాన్నా యీజాతకం! చూడు యిక్కడ చిన్న పొరపాటు చేశావు. దానివల్ల అంతా తారుమారైంది. మతి స్థిమితంగా లేనపుడు యిది వ్రాసినట్టున్నావు!” అంటూ జాతకాన్నిమార్చి, తండ్రికి అది నమ్మకం కలుగకుండేలా వ్రాసి తనకు నూరేళ్లు ఆయుర్దాయం ఉన్నట్టుచేశాడు.

‘విశ్వనాథుడు తనకన్నా గొప్పవాడు! ఏమో తనే పొరపాటుపడ్డాడేమో!’ అని

కాని కుమారుడు పూర్ణాయుష్కుడైనందుకు రామప్ప ఎంతగానో సంతోషించాడు.

కాని విశ్వనాథుడు విచారసాగరంలో మునిగిపోయాడు.

'అయ్యో! ముసలికాలంలో తల్లిదండ్రులకు సేవచేసే భాగ్యానికి నోచుకోనైతిని కదా!' అని సతతమూ విచారించేవాడు. తన మృత్యువు ఎప్పుడు వస్తుందోనని రోజులు లెక్కపెట్టుకొనేవాడు.



'ఈవిధంగా నిరర్థకపు బ్రతుకు బ్రతికేకన్నా చనిపోయేలోగా కాశీ వెళ్ళి తల్లిదండ్రులకు ముందే ఉత్తరక్రియలు చేసి వస్తే వారు పున్నామనరకనుంచి ఉద్ధరింపబడతారు. వారి కడుపున పుట్టినందుకు యీ విధంగానైనా ఋణం తీర్చుకుంటే తనకు ముక్తి లభిస్తుంది' అనుకున్నాడొకనాడు విశ్వనాథుడు.

ఆ నిశ్చయంతోనే ఒకనాటి అర్ధరాత్రి మాతాపితలకు చెప్పకుండా కుంభకోణం వదిలి, పుణ్యకాశీక్షేత్రానికి బయలుదేరాడు. తెల్లవారి విశ్వనాథుడు కనిపించక పోవడంతో రామప్ప చుట్టుపట్ల అంతా వెదికించాడు. కాని విశ్వనాథుని జాడే లేదు!

"చూశావా! నేను చెప్పలేదూ! వాడు పూర్ణాయుష్కుడైనా మనకు అఖరకు రాకుండా పోయాడు! పోనీలే! వాడెక్కడైనా బ్రతికివుంటే అంతేచాలు!" అని భార్యను ఓదార్చి, మనసు దిటవు చేసుకున్నాడు రామప్ప.

ఎక్కడా తన పాండిత్యం ప్రదర్శించకుండా విశ్వనాథుడు అలా ప్రయాణం చేస్తూ కొన్నాళ్ళకు విజయనగర సామ్రాజ్యానికి చేరుకున్నారు.

అతను విజయనగరం చేరుకునేసరికి మసక చీకటి అలుముకుంటూ వుంది. ఆ రాత్రి కచట విశ్రమించి, తెల్లవారగనే ప్రయాణం సాగిద్దామని అనుకున్నాడు. కాని ఆకలి మాటేమిటి? నలుగురైదుగురిని అడిగి చూశాడు.

"ఈరాత్రి ప్రధానమంత్రిగారింట వివాహ మహోత్సవం! సంతర్పణ జరుగుతుంది! అక్కడకు వెళ్ళు!" అంటూ ఒకడు మార్గం చూపించాడు.

# ★ విశ్వనాథుడు ★

విశ్వనాథుడు మంత్రిగారి భవనంవద్దకు చేరుకున్నాడు. అక్కడ జనుల కోలాహలం పెద్ద సందడిగా వుంది!

"అయ్యా! ఉదయంనుంచి వస్తుతో బహుదవ్వునుంచి నడచి వస్తున్నాను. దయచేసి భోజనం పెడతారా!" అంటూ అక్కడున్న ఒక రాజోద్యోగిని అడిగాడు విశ్వనాథుడు.

"వంటలు పూర్తికావచ్చినవి. అంతవరకు ఆలోపటి లోగిలిలో విశ్రమించు. సంతర్పణ మొదలవగానే కేక వేస్తారు" అని చెప్పాడు ఉద్యోగి.

ప్రయాణ బడలికచేత అలసి ఉండటంవల్ల మంత్రిగారి ఇంటి అరుగుపై విశ్రమించగానే విశ్వనాథుడు నిద్రాదేవికి వశుడయ్యాడు.

విజయనగరాధిపతి శూరసేనుడు! అతని కుమార్తె ఇందుమతీదేవి, అందాలభరిణె. చదువుల సరస్వతి! అలాంటి తన కుమార్తెకు తగిన వరునికోరకు, మహారాజు, దేశదేశాలనుంచి రాజకుమారుల చిత్రపటాలు తెప్పించాడు. కాని మహామంత్రి చిత్రపటాల స్వరూపాల్ని మార్చేసేవాడు! కారణం తన కుమారుడు జయవర్మకు, ఇందుమతీదేవిని పెళ్లిచేసి, విజయనగర సామ్రాజ్యానికి జయవర్మను రాజును చేయాలని అతని అభిలాష! అందవికారులైన రాజకుమారుల చిత్రపటాల్ని చూసి విసుగుపుట్టి, మహారాజు అసలు చిత్రపటాల్ని చూడటమే మానివేశాడు. ఇలా కొన్నాళ్లు గడిచిన తరువాత మహామంత్రి తన కుమారుని చిత్రపటాన్ని ఎంతో అందంగా, చిత్రకారులచేత వ్రాయించి తెచ్చి, ఒకనాడు రాజాగారికి చూపించాడు.

ఆ పటాన్ని చూసి రాజుగారు 'ఓహో!' అన్నారు.

"ఎవరోయ్ యితను!" అన్నాడు మహారాజు.

"చిత్తం! అతను నాకుమారుడు జయవర్మ!" అన్నాడు మహామంత్రి వినయంగా.

"అలాగా! చాలా సంతోషం! నాకు తెలియనే తెలియదు! ఒడిలో రత్నాన్ని పెట్టుకొని గాజుముక్క కొరకు దేశాలు గాలించినట్టుంది! మీ జయవర్మకు మా యిందుమతిని ఇచ్చి వివాహంచేస్తాను! అంగీకారమేనా!" అన్నాడు మహారాజు. అందుకంగీకరించాడు మహామంత్రి.

మహారాజు ముహూర్తం యేర్పాటు చేయించాడు! విశ్వనాథుడు విజయనగరం చేరినరోజునే మంత్రిగారింట వివాహ మహోత్సవం...కాని ఒక్కటే చిక్కు! మంత్రిగారబ్బాయికి మూర్ఛరోగంవున్నది! రోజువిడిచి రోజు రాత్రుల్లు అతనికి మూర్ఛ వస్తుంది. అతని దురదృష్టమేమో సరిగ్గా ముహూర్త పురోజునే అతనికి , మూర్ఛ వస్తుంది!

ఈ విషయాన్ని ఆలోచించుకుంటూ మహామంత్రి భవనంలోనుంచి బయటకు వచ్చాడు. ఏమిచేయాలో అతనికి ఆలోచన స్ఫురించలేదు "తీరా పెళ్లిపీటమీదనే మూర్ఛవస్తే ఎంత అల్లరి! తలవంపు కాదూ! మహారాజుగారి ఆగ్రహానికి గురికావాలి! ఏమిచేస్తే గండంగడచి బయటపడగలం" అనుకుంటూ మహామంత్రి అరుగుపై నిదురపోతున్న విశ్వనాథుడివైపు చూశాడు. వెళ్లి తట్టిలేపాడు!

"భోజనం పెడుతున్నారా!" అంటూ లేచాడు విశ్వనాథుడు. మంత్రి విశ్వనాథుడి వైపు దీక్షగా చూశాడు. జయవర్మ, యీ పుత్రవాడు ఒక్కటేపోలిక! ఒకటేఎత్తు! ఆశ్చర్యం!" అనుకున్నాడు మహామంత్రి.

వెంటనే అతనికొక ఉపాయం తట్టింది "చూడబ్బాయి! నీతో ఒకవిషయం మాట్లాడాలి! లోనికిరా!" అంటూ విశ్వనాథుణ్ని లోనికి తీసుకువెళ్లాడు. ఆ తరువాత "నీ వివరవుకే నీది యీ నగరమేనా! అని ప్రశ్నించాడు.

తనకు జ్యోతిషం వచ్చునన్న సంగతి మరుగుపరచి తనతల్లిదండ్రుల ఉత్తరక్రియల కొరకు కాశీవెళ్తున్నట్టు చెప్పాడు.

"అయితేవిను! నీవు నాకొకచిన్న సాయం చేసిపెట్టు! నీవు కాశీవెళ్లడానికి వలసినంత ధనమిచ్చి తగినయేర్పాట్లు చేయిస్తాను." అన్నాడు మంత్రి.

"ఏమిటది?"

"ఆక్షేపమైన కార్యమేమీ కాదు! ఇప్పుడుజరిగే వివాహానికి మా చిరంజీవికి మారుగా, నీవు వివాహవేదికపై కూర్చొని రాకుమారిమెడలో తాళికట్టాలి! మూడుముళ్ళు వేయగానే నీపని తీరినట్టే! ఎలాగో పెళ్ళివారిని ఏమరించి, యిక్కడకు వచ్చేయాలి. ఈరాత్రే నిన్ను కాశీపంపించే యేర్పాటుచేయిస్తాను! అర్థమైందా!" అన్నాడు మంత్రి.

విశ్వనాథుడు యోచించాడు! 'మాతాపితలకు ఉత్తరక్రియలు చేసేటప్పుడు కొన్ని కొన్నిఘట్టాలలో వివాహితుడైవుండి చేయవలసిన పనులున్నాయి! చూడగా, ఇది ఒకవిధంగామంచిదే! పుస్తెకట్టగానే తను గృహస్థు అవుతాడు!' అనుకొని తన అంగీకారాన్ని తెలియబరిచాడు.

ముహూర్తం సమీపిస్తోంది! మంత్రి యీవిషయాన్ని కొందరు ముఖ్యబంధువులకు తెలియబరిచాడు. ఎవరైనా యీరహస్యం బయటపెట్టినట్లయితే పీకలు కత్తిరించి వేస్తానని బెదిరించాడు. మంత్రి తత్త్వం తెలిసినవారు కాబట్టి ఎవరూ కిమ్మనలేదు.

అప్పటికప్పుడే విశ్వనాథుడు పెళ్ళిదుస్తులతో ముస్తాబై వివాహవేదికవద్దకు తీసుకురాబడ్డాడు.

పెళ్లిమండపంలో తనప్రక్క కూర్చున్న విశ్వనాథుణ్ని, ఠీవి, ఆతేజస్సు చూసి, యిందుమతి ఎంతో ముచ్చటపడింది. 'తనకు తగిన వరుడు' అనుకుంది.

వేదోక్త ప్రకారం విశ్వనాథుడు యిందుమతీదేవి మెడలో మూడుముళ్ళూ వేశేసాడు! ఇక అతనిపని తీరినట్టే! అనుకున్న ప్రకారం

అందరినీ సముభ్యపరచి మంత్రిగారి యింటికి చేరుకోవాలి. కాని మహారాణీగారివల్ల విశ్వనాథుడికి ఆ అవకాశం లేకుండా పోయింది. వివాహం అయిన వెంటనే ఆవిడ కుమార్తెనూ, అల్లుడినీ దగ్గరనే ఉండి పల్లకీ ఎక్కించి అంతఃపురానికి తీసుకుపోయింది.

మంత్రి తన కుమారునికి పెళ్ళిదుస్తులు తొడిగించి విశ్వనాథుని రాకకోరకు ఎదురు చూస్తూ వున్నాడు. కాని కథ అడ్డం తిరిగి నందుకు 'ఏం జరుగుతుందో' నని భయపడి పోయాడు.

విశ్వనాథుడు కూడ మొదట ఏమౌతుందో నని భయపడ్డాడు కాని 'జరిగేది ఎలాగూ జరక్కపోదు!' అని గుండె నిబ్బరపరచు కున్నాడు.

అంతఃపురంలో, నూతన వధూవరులకు యేకాంత మందిరాన్ని యేర్పాటు చేశారు. విశ్వనాథుడుకి బయటికి రావీలు లేక పోయింది. గదికి తాళం వేసి బిగాలు తీసుకుపోయింది మహారాణి.

ఇందుమతీదేవి సంస్కృత భాషలో పండితురాలు. అందువల్ల ఆమె విశ్వనాథుణ్ణి అనేక విషయాలు ప్రశ్నించింది. అతను అన్నిటికీ సంస్కృత భాషలో సమాధాన మిచ్చాడు. మీదుమిక్కిలి యిందుమతీ దేవికి ఎన్నో నూతనవిషయాలు బోధించాడు.

'తన భర్త యింతటి ప్రజ్ఞాధురంధరుడా!' అని పొంగి పోయింది ఇందుమతీదేవి.

"రాకుమారి క్షత్రియ కాంత అయినా శాస్త్ర విషయంలో ఉద్దండురాలు. నాకు భార్యగా లభించడం అదృష్టం! అని సంబరపడి మరుక్షణంలోనే 'ఈ సంతోషం తెల్లవారేవరకే!' అని గ్రహించి, విచారించాడు.

ఇందుమతి భర్త ముఖలక్షణాల్ని పరికించింది!

"ఏమండీ! విచారంగా వున్నారు! కారణం తెలుసుకోవచ్చునా!" అని ప్రశ్నించింది.

"ఏమి చెప్పమంటావు! నిన్ను వదలి కాశీవెళ్ళాల్సి వస్తుంది! మళ్ళీ ఎప్పటికి వస్తానో! నాకు యింతే అదృష్టం వుంది కాబోలు!" అన్నాడు విశ్వనాథుడు.

"మీరు కాశీవెళ్తున్నారా! ఎందుకు?" అంటూ ఇందుమతి ఆత్రంగా ప్రశ్నించింది!

విశ్వనాథుడు తెలివి తెచ్చుకున్నాడు! విచారంలో మాట జారానని గ్రహించాడు.

"ఏదో ఆలోచనలో అలా అన్నాను! కాశీ వెళ్దామని అనుకుంటున్నాను! కాని యిప్పట్లో అదిసాధ్యంకాదు. నీవు భయపడ నక్కర్లేదు!" అన్నాడు విశ్వనాథుడు.

ఆతరువాత అతనికి ఆకలిబాధ స్ఫురణకు వచ్చింది. ఆనాటి ఉదయాన్నెప్పుడో

 

# విశ్వనాథుడు



భోజనంచేశాడు! మంత్రిగారుకూడ అతనికి భోజనసదుపాయాలేవీ చూడలేదు. అతనికేమొ కోపవచ్చేలా వుంది.

అతను వెంటనే, ఇందుమతిని ఉద్దేశించి "నిజంగా భర్తపై ప్రేమ వాత్సల్యం ఉన్న స్త్రీ అయితే ముందు అతని ఆకలి విషయం చూస్తుంది. ఈవిధంగా వ్యర్థప్రసంగంచేసి విసుగుపుట్టించదు" అన్న అర్థంవచ్చేటట్టు విశ్వనాథు డొకశ్లోకాన్ని గంభీరంగా చెప్పాడు.

ఆశ్లోకాన్ని ఇందుమతి అర్థంచేసికొని "క్షమించండి! ఆనందంలో మైమరచాను" అంటూ ఫలహారాలు, పాలు పళ్లు తెచ్చి విశ్వనాథునిచేత తినిపించి సంతుష్టుని చేసింది!

"మీరు చెప్పినశ్లోకం ఎంతో చక్కగా వుంది! మళ్లా చెప్పండి! మన ప్రేమకు గుర్తుగా గోడమీద వ్రాస్తాను" అన్నది.

విశ్వనాథుడు నవ్వుకుంటూ శ్లోకాన్ని మళ్ళా చదివాడు! ఇందుమతి దాన్ని గోడపై వ్రాసింది.

ఆ రేయి కబుర్లతోనే గడిచిపోయింది. తెల్లవారుతుందనగా మంత్రిగారి పరిజనం వచ్చి విశ్వనాథుణ్ణి తీసుకొని వెళ్ళిపోయారు.

"నీకు అప్పగించిన బాధ్యత ఎంత? అంతఃపురానికిగూడా వెళ్ళావా! చెప్పు! ఈ రహస్యం బయటకు పొక్కిందా!" అంటూ గుసగుసలాడాడు మహామంత్రి.

"తప్పించుకు రావడానికి అవకాశమే లేకపోయింది! సన్నేం చేయమంటారు! రహస్యాన్ని బయట పెట్టేటంత మూర్ఖుణ్ణికాదు" అన్నాడు విశ్వనాథుడు.

"సరి! నీవిక ఇక్కడ జాగుచేయడం ప్రమాదం! నిన్ను హతమార్చడమే మంచిది! కాని, ఒక్క ఘడియ నా కుమారుడిలా పెళ్ళిపందిట్లో కూర్చున్నావు కాబట్టి నిన్ను దయతలచి క్షమిస్తున్నాను. నీకు వలసినంత ధనం పల్లకిలో పెట్టించాను. బోయీలు నిన్ను, ఈ సామ్రాజ్య పొలిమేరవరకు విడిచి వస్తారు. తిరిగి నీముఖం విజయనగర సామ్రాజ్యంలో కనుపించగూడదు! తెలిసిందా!" అంటూ మహామంత్రి అప్పటికప్పుడే విశ్వనాథుణ్ణి కాశీ ప్రయాణం కట్టించాడు.

వివాహమైన మరునటిదినంకూడ వధూవరులిద్దరూ పూజచేసి, అగ్నిహోత్రునికి ప్రదక్షిణం చేయాలి."

'వివాహం ఎలాగూఐపోయింది! ఇక భయపడవలసిన అవసరంలేదు!' అన్న ధీమాతో మహామంత్రి జయవర్మను పెళ్లిదుస్తులు తొడిగి పంపించాడు. కాని తనప్రక్క కూర్చున్న జయవర్మను చూసి ఇందుమతి పాము ను చూసినట్టు అదిరిపడి 'కాదు! వారుకాదు! ఇదేదోమోసం!' అనుకుంటూనే మూర్ఛపోయింది. అంతా యీ విపరీతానికి భయపడ్డారు. శీతలోపచారాలు జరిగిన పిమ్మట తెలివి తెచ్చుకుంది. ఆమె అక్కడ ఏమీ గొడవచేయలేదు. పూజా పురస్కారాలు యథావిధిగా జరిగిపోయాయి. ఇద్దర్నీ అంతఃపురానికి తీసుకు వెళ్లారు.

అక్కడ నిలదీసి అడిగింది "ఎవరవు నీవు! ఏమిటీ మోసం!" అని

"మోసమేమిటి? నేనుమంత్రికుమారుడను. నీ భర్తను!" అన్నాడు.

"కాదు! నాకు తెలుసు! అతని బ్రహ్మతేజస్సు నీలోలేదు. చెప్పు! ఎవరవు నీవు!" రెట్టించింది ఇందుమతి.

"నీకు పిచ్చిపట్టింది!" అన్నాడు జయవర్మ.

"అవును పిచ్చిపట్టింది! ఇలారా! పిచ్చి ఎవరికో నిర్ధారణ చేసుకుంటాను! అదుగో ఆ గోడమీది శ్లోకానికి అర్థం చెప్పు!" అన్నది ఇందుమతి.

"భలేపరీక్ష! నాకు సంస్కృతం రాదు. అంతమాత్రాన నీభర్తను కానని అనుకోవద్దు! నేను నీభర్తనని లోకానికి తెలుసు!" అన్నాడు.

ఇందుమతి దీర్ఘాలోచన చేసింది!

'ఇతను తన భర్త కాదు. మంత్రి కుమారుడు కావచ్చు! ఇందులో మోసం వుంది! తనభర్త సంస్కృత పండితుడు. అతనిలో బ్రహ్మతేజస్సు ప్రజ్వరిల్లుతుండడంవల్ల అతను బ్రాహ్మణుడయి వుండవచ్చు! నిన్నటి దినం సంభాషణలో కాశీ వెళ్తున్నట్టు మాట జారారు! అదే నిజం కావచ్చు! అతను ఎవరైనా తనభర్త ఆయనే! ప్రస్తుతానికి ఏ గొడవ చేయకుండా, తెలివిగా ప్రవర్తించడమే మంచిది! లేదా గౌరవప్రతిష్ఠలు దక్కకపోగలవు! అనుకున్నది.

వెంటనే జయవర్మతో "మీరంతా కలిసి ఏదో కుట్రపన్నారు. నాకు తెలుసు! నీవు లోకం దృష్టిలో నా భర్తవు! అలాగే, దర్బారులో రాజుగారిఅల్లుడిగా ప్రవర్తించు! నా దగ్గర నీ ఆటలు సాగవు! జాగ్రత!" అంటూ బాకు తీసింది.

జయవర్మ హడలిపోయి పరుగెత్తాడు.

'తన భర్తను ఎలాగైనా విజయనగరం రప్పించాలి!' అనుకుంది.

మర్నాడు తండ్రివద్ద కెళ్ళి "నాన్నా! నేనొక మౌనవ్రతాన్ని సంకల్పించాను. ఆ వ్రతం ఎప్పటికి పరిపూర్తి అవుతుందో చెప్పలేను. మీరు ఆముదుకొక సత్రంచొప్పున కాశీవరకు కట్టించండి! నేనొక శ్లోకాన్ని యిస్తాను. దాన్ని ప్రతిసత్రంలోను వ్రాయించండి! ఆ శ్లోకానికి అర్థాన్ని, అది ఎప్పుడు చెప్పబడిందో తెలిసినవారిని యిక్కడకు తీసుకురమ్మని భటులను అక్కడ కాపుంచండి. ఇంతే! నా మీద వాత్సల్యముంటే మీరు ప్రశ్న వేయక యివన్నీ జరిపించండి!" అని వేడుకుంది యిందుమతీదేవి.

మహారాజుగారికేమీ అర్థంగాక పోయినా "సరే! చిట్టితల్లీ! అలాగే చేయిస్తాను" అన్నారు.

మరునాడే యిందుమతి మౌనవ్రతం ప్రారంభించింది. మహారాజు సత్రనిర్మాణానికి పూనుకున్నారు.

ఇక విశ్వనాథుని సంగతి! ఇందుమతి

(56–వ పేజీ చూడండి)

# వనితా లోకం

## మనసుకు నచ్చినట్లు....

చెప్పుడు మాటలకు చెవియొగ్గరాదని మనవాళ్లు చెప్పుతూ వుంటారు. అది అందరికీ కొన్ని కొన్ని సమయాల్లో అనుభవానికి వస్తూనే వుంటుంది. ఇతరులమాటలు సాధారణంగా ఎప్పుడు వినవలసివస్తుందంటే మనకి స్వంతంగా ఆలోచించగలిగేశక్తి లేనప్పుడు. తాము చేసేపని తప్పో ఒప్పో తమకు తెలీదు. అసలు ఏదైనా పనిచెయ్యబోయినప్పుడు అది ఎలాచేస్తే సఫలమవుతుందో, ఎలాచేస్తే విఫలమవుతుందో వాళ్ళకి తెలుసుకోగలిగే శక్తివుండదు. ఎంతసేపు వాళ్లు ఇవతలి వాళ్ళ మీద ఆధారపడివుంటారు. వాళ్లు చెప్పిందే వేదం అనుకొని వాళ్ళ నిత్యకృత్యాల్లో కూడా ఇతరులసహాయం అపేక్షించుతారు. ఇటువంటివాళ్లు మన జీవితంలో చాలామంది తారసపడతారు.

దీనికి కారణం చిన్నప్పటి వాళ్ల పెంపకంలో వున్న లోపమే అని చెప్పవచ్చు. ఎందుకంటే "చిన్నపిల్లడు కదా అయ్యో పాపం ఏమీ తెలీదు" అని తల్లితండ్రులు ముద్దు కొద్దీ పిల్లల్ని ఏపనీ స్వంతంగా చెయ్యనివ్వరు. అంతేకాదు; స్వంతంగాఆలోచించుకునేందుకు కూడా అవకాశం యివ్వరు. వీధిలో నలుగురిపిల్లలతో కలసి ఆడుకుంటే తమ పిల్లడు ఎక్కడ చెడిపోతాడో అని ఎవ్వరితోను మాటలాడనివ్వకుండా, ఎక్కడికీ వెళ్లనివ్వకుండా ఇంట్లోనే వుంచుతారు. ఎవరైనా ఏమమ్మా! మీ పిల్లడిని ఎప్పుడూ ఇంట్లోనే వుంచుతారు. ఆడుకుందికి పంపించకూడదూ? అంటే అమ్మో! మాపిల్లడు అమాయకుడు వాళ్లేమేనా చేశారంటే మావాడు జవాబుకూడా చెప్పలేడు అని వెనకేసుకొస్తారు.

### "ఈపూటకి పాఠం వద్దులెండి"

ఇంక స్కూలుకి పంపించవలసిన సమయంలోకూడా కొందరు తల్లులు బడికి పంపుతే ఆ అలగామూకతో తిరిగి పిల్లడు ఎక్కడ చెడిపోతాడో అని యింటిదగ్గరే ప్రయివేటు మాష్టర్ని పెట్టి చదువు చెప్పిస్తారు. గారాబంగా పెరిగే ఇటువంటి పిల్లలకి తల్లితండ్రులవద్ద ముద్దువల్ల మాష్టరంటే భయంలేక అతను వచ్చేవేళకి తల్లి కొంగుపట్టుకు తిరిగి నాలుగు తియ్యమాటలాడి ఆ తల్లి చేత "ఈ పూటకి ప్రయివేటు వద్దులెండి మాష్టారు" అని అనిపిస్తారు.

మా పొరుగున ఒక పదేళ్ళ అబ్బాయి ఉన్నాడులెండి. ఆ అబ్బాయి అంటే వాళ్ళ అమ్మగారికి నాన్నగారికి విపరీతమైన అభిమానము. స్కూలుకి పంపించరు. ప్రయివేటు మాష్టరు వచ్చేవేళకి ఆ పిల్లడు కడుపునొప్పనో, కాలునొప్పనో ఏదో మిష పెట్టి ఏడుపు మొదలుపెట్టాడు. దాంతో ఆవిడ వెంటనే ఈ రోజుకి వెళ్లిపోండి మాష్టారు అంటుంది. అలావుంది ఆ అబ్బాయి చదువు.

ఇటివాళ్లు పెద్దవాళ్లయి జీవితంలో ప్రవేశించేసరికల్లా స్వంతంగా ఆలోచించుకునేశక్తిని కోల్పోతారు. ఇటువంటిపాత్ర శరత్ చంద్ర చటర్జీయొక్క "బడదీదీ"లో శేఖర్ ది. స్వంతముగా ఆలోచించేశక్తి లేని వాళ్లు ఏ పని చేసినా ఇతరుల సహాయమును అపేక్షించుతారు. పైవాళ్లు మంచివాళ్లయితే పరవాలేదుగాని వాళ్ళే ఇతరులయొక్క బాగును చూడలేనివాళ్ళయితే జీవితాలు నాశనమయ్యే సలహాలు చెప్తారు.

అసలు యిటువంటివి చాలా ప్రమాదం. ఏమంటె నాకో స్నేహితురాలుండేది. ఆవిడ భర్తపైన నేను చెప్పినరకం వాడే. ఆవిడని చాలా అభిమానంగా చూసేవాడు. ఆవిడ ఒకమాటు వాళ్ళ పుట్టింటికివెళ్ళింది. వాళ్ళ పక్కింటావిడ పుట్టిల్లుకూడా మా స్నేహితురాలి పుట్టిల్లు వున్న దగ్గరే. ఇద్దరూ కలిసేవెళ్ళేరు. అటునుంచి ఆపక్కింటావిడ ముందరగా వచ్చింది. వచ్చి ఇతనిభార్య మీద లేనిపోని అపవాదులన్నీ కల్పించిప్రచారంచేసింది. దాంతోఅవన్నీ అతని చెవిదాకాపోకి భార్యను తిరిగి తీసుకు రావడం మానేశాడు. ఆవిడ భర్త అకారణకోపానికి ఆశ్చర్యపోతూ తనంతతానే భర్తయింటికి వచ్చింది. నిజాన్ని తెలుసుకునేందుకు ప్రయత్నించని ఆ భర్త ఆవిడని అనరాని మాటలనితగిలేసేడు. ఇలా వుంటాయి పరిస్థితులు.

ఆలోచించగలిగేశక్తి వున్న వాళ్ళు రెండోరకం మనుష్యులు. వీళ్ళకి మంచేదో, చెడ్డేదో ఆలోచించగలిగేశక్తి వుండి కూడా చెడ్డలోకి ప్రవేశిస్తారు. ఒకవిషయం వచ్చిందంటే దాన్ని ఏ విధంగా పరిష్కరిస్తే ఫలితం వుంటుందో అని తమ తెలివితేటల్ని ఉపయోగించి బాగా ఆలోచిస్తారు. ఆలోచించి ఆలోచించి గబుక్కున ఏవిధంగా చేస్తే ఫలితం శూన్యమో ఆ మార్గంలోనికి చొరపడతారు. దీన్నే మనవాళ్ళు "ఎత్తెత్తి కాళ్లు ఎంగిలాకులో వెయ్యడం" అంటారు. పాపం అది పెద్దలోపమే. భగవంతుడు ఆలోచించగలిగేశక్తిని యిచ్చికూడా సమయానికి ఉపయోగం లేకుండా చేస్తాడు. ఇలాటివాళ్లు భవిష్యత్తును ఎటూ నిర్ణయించుకోలేక అడుగడుగునా సందేహాలలో పడుతూ, జీవితమంతా దుఃఖమయం చేసుకొని నిర్గంధకుసుమాల్లా చలామణీ అవుతారు.

ఇటువంటి సమయాల్లో ప్రతివాళ్ళకిఆత్మపరిశోధనసదసద్వివేచతత్వం, నిగ్రహం అవుసరం. మనంచేసేపని, మనమనసులో బాగా ఆలోచించుకొని మన మనస్సుకి నచ్చితే ఇంకొకరిని సలహా అడగనక్కర్లేకుండానే ఆ పని చేసుకోవచ్చు. ఏదైనా మనమనస్సుకి మనం చేస్తున్నది చెడ్డపనో మంచిపనో తెలుస్తూనే వుంటుంది. అటువంటప్పుడు చెడ్డవేపు ఉరక

# స్థూలత్వం తగ్గడానికి—

నిజం చెప్పాలంటె, స్థూలకాయాన్ని లఘుకాయంగా మార్చుకోవడం ఈరోజుల్లో 'ఒక ఫేషను'గా గోచరిస్తుంది. మొత్తానికి శరీరం పెరగడం, — అంటే అధికంగా క్రొవ్వుపట్టడం — మనలో కొందరికి పెద్దసమస్యగానే ఉన్నట్టు తోస్తోంది. నిజంగా శరీరం ఆరోగ్యం పెరిగిందా? లేక మానసికంగా, కొందరు మనల్ని స్థూలకాయుల జాబితాలో వేసేస్తున్నారని భీతిచెందుతున్నామా? అనేది సమస్య!

సన్నగా ఉన్న స్త్రీ సున్నితమైనదనీ సౌందర్యవతి అనిపించుకోడానికి అది ఒక యోగ్యత అనీ మనం భావిస్తున్నాం. సన్నగా నాజూకుగా ఉండడం వాంఛనీయమే. శాస్త్రరీత్యా అది ఆరోగ్యాన్నే సూచిస్తుంది... సరే ఇక, అందంమాట నిర్వివాదాంశమే కదా!

ఆదర్శప్రాయమైన బరువు, స్త్రీకి ఏది? అనే సమస్యను పరిష్కరించడం అంతసులువైన విషయం కాదు. కాని ఎవరిమటుకు వాళ్లు ఈవిషయం చులాగ్గా తేల్చుకోవచ్చును. ఎంత క్రొవ్వు పెరిగినా, ఎంత బరువు వృద్ధిపొందినా, తనకు సులువుగా, సునాయాసంగా తన దిన చర్యలను తాను సాగించగలుగుతోందా అని చూచుకుంటారు. మరోకమాటలో చెప్పాలంటె తనబరువు తనకు ఎట్టి సమస్యా కాకుండా ఆయాసమూ, ఒగుర్పూ, అలసటా, మందకొడితనమూ లేకుండా ఉంటె తన శరీరం పెరుగుతున్నందుకు ఆక్షేపణ ఏమిటి? అని నా అభిప్రాయం. అంతే కాకుండా సన్నగా, సున్నితంగా, అర్భకంగా ఉండి. రక్తహీనతతో, పాండురోగంతో పాలిపోయి, చురుకుతిమ్మెర్లతో నీరసంగా, నిస్సత్తువగా, మూల్గుతూ మూల్గుతూ ఉండేకంటే నయమేకదా? ముఖ్యంగా తనకు తగిన లావునూ, అవసరమైన బరువును తగ్గించుకొని లేనిపోని బాధలను పడటంకూడా న్యాయం కాదు!!

**జి. సావిత్రి**

శారీరకంగానూ, మానసికంగానూ యవ్వనంలో—అంటే ఇరవై ఏళ్ళ ప్రాయంలో ఎంత శక్తివంతంగా, చురుకుగా, చైతన్యంతో ఉన్నామో అంత శక్తివంతంగా ఉన్నంతకాలం మనచర్మానికి అడుగున ఎన్ని క్రొవ్వు దొంతరలు పెరిగినా పరవాలేదు.

పైన ఉదహరించిన వాస్తవిక విషయాలు అలా ఉండగా శాస్త్రజ్ఞులు—కొందరు మన ఎత్తునుబట్టి బరువు ఎంతఉంటే సహజమో ఒక కొలమానాన్ని తయారుచేశారు. అయినా ఉజ్జాయింపు కొలమానం మాత్రమే! అయిదడుగులు ఎత్తు ఉన్న స్త్రీ 112 పౌన్ల బరువు ఉండాలనీ అంటె అయిదడుగులుపైన ఉన్న స్త్రీకి అదనపు అంగుళానికి అయిదు పౌనులు కలపాలనీ ఒకనిర్ణయం చేశారు.

## శరీరాన్ని తగ్గించుకోవడం

అధికంగా క్రొవ్వుపట్టడం వలన అనేక దుర్లక్షణాలు కలగడంతోపాటు శరీరసౌష్ఠవం తగ్గిపోతుందని, వాటం విలక్షణంగా కనిపిస్తుందనీ అంటారు. ఈమాటకూడా నిజమే! సహజమైన శరీరసౌందర్యానికి క్రొవ్వుపొరలు వైకల్యం కల్గించడం సత్యదూరం కాదు.

అందంగా ఉన్నాననే అభిప్రాయం కల్గినపుడు ఆనందంగా ఉండడం సహజం. ఆనందం ఆరోగ్యానికి దారితీయడం కూడా సహజమే. పెరిగిన పొత్తికడుపూ, మెడక్రింద ముడతలుపడ్డ క్రొవ్వుపరుపూ ఎవరికిమటుకు ఆందోళన కల్గించదు? ఏ సోదరి బెంగపడి ఆ బెంగంతో ఆరోగ్యం చెరచుకోదు?

క్రొవ్వు పట్టడంవలన కలిగే దుష్ఫలితాలను ఆరోగ్యశాస్త్రరీత్యా పరిశోధించి తేల్చారు. ప్రప్రథమంగా శరీరంయొక్క బరువు హెచ్చడంవలన, ఈబరువైన శరీరం మోయడంలో శక్తి చాలాకర్చయిపోతోంది. అందువలన స్థూలకాయం కల్గిన సోదరీమణులు కళ్ళుతిరగడం, ఆయాసపడడం, ఒగర్చడం జరుగుతూ ఉంటుంది. అంతే కాకుండా నడక కుంటుపడుతుంది. కండరాలపైనా కాళ్ళపైనా బరువుబాధ అధికమై దినచర్యలు కూడా సక్రమంగా నిర్వహించలేనిస్థితికి వస్తున్నారు. ఈ శారీరకమైన నిస్సత్తువ మానసికమైన నిస్పృహను, మందకొడితనానికి దారి తీస్తుంది. మనస్సు చురుకుతనాన్ని, సహజమైన చైతన్యాన్నీ కోల్పోతుంది.

ఆరోగ్యం చెడిపోవడానిక్కారణం చర్మంక్రింద పెరిగే క్రొవ్వు పొరలుమాత్రమే కాక, శరీరంలో కండరాలమధ్య తదితర అవయవ ప్రాంతాలలో పెరిగే క్రొవ్వు పొరలు కూడాను. "క్రొవ్వినగుండె" (Fatty Heart) అనే బుగ్మత ఏర్పడటానికి కారణం క్రొవ్వు పదార్థం గుండె చుట్టునూ గుండె లోపలాను పెరగడమే. ఈక్రొవ్వు పెరగడం వలన గుండె తనంతతాను చేసేచలనం మందగించబడుతుంది, తద్వారా శరీరానికి రక్తం సకాలంలో సక్రమమైనవేగంలో చేరదు. అందువలన రక్తంలోకి ప్రాణవాయువు రావడం ఆలస్యమై రక్తంలోని బొగ్గుపులుసు వాయువు బయటికిపోవడం తగ్గిపోయి, శరీరంలో మలిన మధికమవుతుంది. రక్తప్రసారం మందగించడంవలన శరీరంలో ఉష్ణం అంటే శక్తిలేక నిస్సత్తువ ప్రాప్తిస్తుంది.

అంతే కాకుండా వైద్యశాస్త్రరీత్యా స్థూలకాయులలో కడుపునొప్పులు, విషపడిశము, ఉబ్బసం, రక్తపుపోటు, మధుమూత్రము అధికంగా కనిపిస్తుందని తెలుస్తూంది. స్థూలకాయులకు శస్త్రచికిత్స చేయడంకూడా అపాయకరమైనదని శస్త్రవైద్యుల అభిప్రాయం.

(40-వ పేజీ చూడండి)

## మనసుకు నచ్చినట్లు

ప్రయత్నించకుండా మనస్సుని అరికట్టి మంచివేపు వెళ్ళడానికి ప్రయత్నించాలి.

మనమనస్సే మనకి గురువు. అన్ని వేళల్లో మనని వెంటాడుతూ మంచేదో చెడ్డేదో నిర్ణయించి చెప్పుతూవుంటుంది. భగవంతుడు మనకిచ్చిన తార్కికజ్ఞానాన్ని, ఆలోచనా శక్తిని దుర్వినియోగపరచుకోకుండా మనం ఏది ఎలా చేస్తున్నాం, ఏది ఎలా చేస్తే బావుంటుంది అని ప్రతివిషయంలో జాగ్రత్తగా ఆలోచించి మరీచేస్తే మనం ఎప్పుడూ తప్పు చేసేందుకు అవకాశం వుండదు. జీవితం కూడా సరియైనమార్గంలో నడుస్తుంది.

అలా అని ఇతరులమాట పెడచెవిని బెట్టమనికాదు నా వుద్దేశం. మనం స్వయంగా ఆలోచించుకునే శక్తిని కలిగివున్నప్పుడు ఇతరులు చెడ్డచెప్పినా ఫరవాలేదు. ఏమంటే వారు చెప్పింది విని ఆలోచించి బావుంటేనే ఆ మార్గం పడ్తాం. లేకపోతే లేదు.

## గుమ్మడి ఆవకాయ

**కావలసిన సామాన్లు:**—1 గుమ్మడికాయ, పావుశేరు ఆవాలు, పావుశేరు వుప్పు, పావుశేరు కారం, రెండు గరిటెల పప్పునూనె, 1 టీస్పూను పసుపు, శనగగింజంత ఇంగువ.

**చేయు విధము:**—ముందు గుమ్మడికాయను శుభ్రంగా కడిగి తుడువవలెను. పావుశేరు ఆవాలు ఎండబెట్టి మెత్తగా పొడుంకొట్టి జల్లించి అట్టిపెట్టవలెను. తర్వాత ఉప్పుకూడా మెత్తగా దంచవలెను. గుమ్మడికాయను ముక్కలుగా కోసి ఒక స్టెయిన్ లెస్ సీల్ పాత్ర లోనికి తీసుకొని అందులో ఆవాల పొడి, ఉప్పు, ఇంగువ, ఒక టీస్పూను పసుపు, రెండు గరిటల నూనెపోసి, వీటి అన్నిటిని ముక్కలతో బాగా కలిసిపోయేటట్లు కలిపి, ఒక జాడీలో పెట్టుకొనవలెను. రెండు మూడు గంటల సేపటికి బాగా వూరి మామిడికాయ వూరగాయకి మల్లే చాలా రుచిగా వుండును. యీ గుమ్మడికాయ వూరగాయ చెడిపోకుండా రెండు మూడు నెలలవరకు నిలవవుండును.

దీనికి ఏమంత ఖర్చుకాదు. తక్కువ ఖర్చుతో వస్తుంది. భోజనములోనికి ఒక ఆధరువుకింద వుంటుంది.

పావులూరి లీలావతి, (గోవాడ).

# ★ బొప్పాయి కాయతో ★

కాయగాను, పండుగానూ కూడా ఉపయోగించేవాటిలో బొప్పాయి (లేక మదన ఆనపకాయ) ఒకటి. పండు, వంటికి చాల ఆరోగ్యకరమైనది. ఇంక కాయల సంగతి ఏమిచేయాలో చాలమందికి తెలియదు. ఆ కాయలు మేము చాల రకాల కూరలుగా వండుకుంటాము. అందులో కొన్ని రకాలు ఈ క్రింద వ్రాస్తున్నాను.

పచ్చిగావున్న కాయ అంటే మరీ లేతగా కాక పసుపుపచ్చనిరంగురాక, తెల్లగావున్న కాయను తెచ్చి మధ్యకు కోస్తే కొబ్బరి చిప్పలమాదిరి వుంటాయి. చెంచాతో లోపల గింజలు వగైరా గోకి, శుభ్రంగా కడిగి కొబ్బరికోరాంలో కోరినట్లయితే చక్కగా కొబ్బరికోరులాగ వస్తుంది. ఆ కోరుతో ఎన్నిరకాల కూరలైనా వండవచ్చును. వంటికి చాల ఆరోగ్యం; తేలికగా జీర్ణం అవుతుంది.

## ఆవ కూర

బొప్పాయి కోరును కొద్దినీళ్లుపోసి వుడికించి వార్చవలెను. ఆ వార్చిన కోరులో ఎవరి ఇష్టాన్నిపట్టి వాళ్లు చిక్కని పులుసు, వుప్పు, పసుపువేసి సన్నటిసెగమీద ఇగరనిచ్చి తీసి పళ్లెంలో పెట్టుకోవలెను. ఆ తర్వాత 4 ఎండుమిర్చిముక్కలు, శనగపప్పు, మినప్పప్పు, కొద్దిగా ఆవాలు వేయించి, తర్వాత పచ్చిమిర్చిముక్కలు, కరివేపాకు అందులో వేసి వేయించి పళ్లెంలో పెట్టుకున్న కోరు పోపులో వేసి మూతపెట్టవలెను. 2 నిముషాలతర్వాత సుమారు రెండు కాయల కోరుకు, 2 టేబుల్ స్పూనుల ఆవాలు 2 ఎండుమిర్చి వేసి రోట్లో మెత్తగా నూరవలెను. ఆ ఆవ పళ్ళెంలోకి తీసి 4 గరిటెల నూని వేసి ఆ ముద్దకు బాగా కలిపి అది

## పాకల సీత

కూరలో బాగ కలిసేలాగ కలిపితే ఘుమఘుమలాడుతూ చాల బాగుంటుంది. కాని ఈ కూర, (ఆవమూలాన) కొంచెం వేడిచేస్తుంది.

## మసాలా కూర

బొప్పాయి కోరును మెత్తగా వుడికించి వార్చినతర్వాత పళ్ళెంలోకి తీసుకోవలెను. 4 నీరుల్లిపాయలు, 4 పచ్చిమిరపకాయలు సన్నగా తరగి ఉంచుకోవాలి. ఆ తర్వాత గిన్నెలో కొస్త నూనెవేసి (మామూలు కూరలకన్న ఎక్కువగా) 4 ఎండుమిర్చి ముక్కలు, శనగపప్పు, మినప్పప్పు, కొంచెం ఆవాలువేసి వేగినతర్వాత నీరుల్లిముక్కలు, పచ్చిమిర్చి, కరివేపాకువేసి అవి దోరగా వేగినతర్వాత ఈ కోరును దాంట్లోవేసి సరిపడిన వుప్పు, (మెత్తగా నూరినది) పసుపు వేసి మూతపెట్టవలెను. నూనెతో ఈ కూర 10 నిముషాలు వుడికినతర్వాత దాల్చిన చెక్క, లవంగాలు, ఏలకులు సమానంగా పొడిచేసి ఆ పొడి, చిటికెడువేసి కలిపి దింపినట్లయితే మసాలా ఘుమఘుమలతో ఈ కూర చాల బాగుంటుంది.

## పప్పు కూర

బొప్పాయికోరు వుప్పుతో వుడికించి వార్చినతర్వాత దానికి సరిపడిన శనగపప్పు, కొద్దిగా నీళ్లుపోసి పలుకులేకుండా ఎక్కువ నీరు లేకుండా సన్నసెగమీద వుడికించిన తర్వాత పప్పుకు సరిపోయే వుప్పువేసి వేరే పళ్ళెంలో పెట్టుకోవలెను. ఆ తర్వాత గిన్నెలో నూనెవేసి 4 ఎండుమిర్చిముక్కలు, కొద్దిగా మినప్పప్పు, జీలకర్ర, 4 పచ్చిమిర్చి ముక్కలు, కరివేపాకువేసి వేయించి వుడికించిన పప్పు, కోరు కలిపి పోపులోవేసి మూతపెట్టిసన్నటిసెగ పెట్టవలెను. ఆతర్వాత శనగబద్దంత ఇంగువ చెంచాడు నీళ్ళలో కలిపి కూరలోపోసి బాగా కలిపితే బాగుంటుంది. ఇంగువ ఇష్టంలేనివాళ్లు మానేయవచ్చు.

## నూపప్పు కూర

కోరు వుడికించి వార్చినతర్వాత ఎండుమిర్చిముక్కలు, శనగపప్పు, మినప్పప్పు జీలకర్ర, కరివేపాకు, పచ్చిమిర్చిముక్కలు పోపులో వేయించిన తర్వాత అర్ధపావుశేరు నూపప్పు ఎర్రగావేయించి, మెత్తగా పొడికొట్టి ఆ నువ్వులపొడి కూరలోవేసి కలపవలెను.

## పెరుగు పచ్చడి

కమ్మని గట్టిపెరుగులో తగినంత వుప్పు, పసుపు పచ్చిమిర్చిముక్కలు కొత్తిమిర వేసి బాగా కలిపినతర్వాత 4 ఎండుమిర్చిముక్కలు ఆవాలు, 4 మెంతిగింజలువేసి నేతితో వేయించి పెరుగులో కలపవలెను. ఆ తర్వాత బొప్పాయికోరు వుడికించి వార్చి బాగా చల్లారిన తర్వాత పెరుగులో కలిపితే కొబ్బరికాయ పెరుగుపచ్చడిలాగానే వుంటుంది. ★

# ఉల్లి : వెల్లుల్లి

వనితలకు, ఉల్లికి అవినాభావసంబంధముంది. ప్రొద్దున్న లేచి, వంటింట్లో అడుగుపెట్టి, రాత్రి పదింటికి పక్కమీద వాలేలోపున దేనికోదానికి వుల్లినో, వెల్లుల్లినో వాడనిరోజువుండదు. "వనితాలోకంలో వివిధవిషయాలను చర్చిస్తున్నారుకాని, నిత్యసన్నిహితములైన వీటినిగూర్చి ఏ ఒక్కరూ వ్రాయలేదేమూ?" అని ఆశ్చర్యపడుతుండగా, ఉల్లిమీది వ్యాసం కళ్లబడి ఉల్లాన్ని చల్లబరిచింది. అయినా ఉల్లిమీద ఉడతాభక్తిగా మేము చెప్పబోయ్యే మరికొన్ని విశేషాలను వినండి.

"ఇంతముండకు ఒంటినిండా చీరెలు (నీరుల్లి) "ఇంతముండకు కడుపునిండా పిల్లలు (వెల్లుల్లి)," అని చిన్న పొడుపు కథల్లో వీటి స్వరూపాలను పూర్వులు సమగ్రంగా చిత్రించారు. పొడుపుకథలు ఉల్లిపాయలకు 'ఫోటో'ల్లా వున్నాయనడంలో అతిశయోక్తిలేదు. వృక్షశాస్త్రపు వర్ణనలన్నీ దీనికి తీసికట్టు! ఉల్లిపాయ చూడ్డానికి చక్కగా 'బల్బు'లా వుంటుంది. విప్పుతుంటే పొర తర్వాత పొర వస్తూ, చూసేందుకు తమాషాగా వుంటుంది. ఈ పొరల్లోనే అది తనకు కావలసిననీటిని ఆహారాన్ని దాచుకుంటుంది.

"ఉల్లిచేసినమేలు తల్లికూడా చెయ్య"దని ఒక సామెత. అంటే వుల్లి ఒంటికి అంత మంచిదన్నమాట! చిరస్మరణీయులైన కీ॥ శే॥ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు ఉల్లిపాయలంటే చెవికోసుకునే కవితల్లజుని నోట అందమైన యీ క్రింది కందాన్ని ఆంధ్రులోకాని కందించారు.

మందరపు లలిత, పద్మ

"ఉల్లిని దూషించినయా
గుల్లామునుఁబట్టి ముక్కు గోయఁగ వలదా
తల్లుండవలయు లేదా
యుల్లుండగవలయుఁభోజనోత్సవవేళన్"

ఉల్లి వైద్యంలో వుపయోగపడుతుంది. ఉల్లి వుపయోగాలను గూర్చి విదేశాలలో విశేషంగా పరిశోధనలు చేసేరట! అమ్మమ్మకిపరిశోధనల పాగ పోకలేదు. కాని అవిడ అమోఘంగా వాపులకు, చీముపట్టిన కురుపులకు వుల్లిపాయతో వైద్యంచేసేది. ఉల్లిపాయ, పాముక, మెత్తగా నూరి వుడకపెట్టి ఆ ముద్దను గాయంమీదవేసి కట్టుకడితే, నొప్పిగాని, వాపుగాని యిట్టే తీసేస్తుంది. కొంతమంది చిన్నపిల్లలకు "చిన్నపిల్లగుణ" మని ఒక జబ్బువేస్తుంది. ఆ జబ్బుకి వుల్లిపాయ వజ్రాయుధంలాంటిది. జబ్బు కనపడినవెంటనే, ఉల్లిపాయ చిదిపి,ముక్కుదగ్గిర, చెవులదగ్గిర పెడితే, రోగికి వెంటనే తెలివివస్తుంది.

కండ్ల కలకకు ఖచ్చితమైన మందు ఉల్లిపాయ. కొన్ని ఉల్లిపాయలను రోట్లో వేసి కసబిసదంచి ఆ ముద్దను శుభ్రమైన సన్నటి గుడ్డలో వేసి, కంటిలో ఒక్క చుక్క రసం పిండితే చాలు, కండ్ల కలక గాలికి ఎగిరిపోతుంది. చెవిపోటుకు వెల్లుల్లితో వెలలేని మందు చెయ్యవచ్చు. కొస్త మంచినూనెలో ఒక వెల్లుల్లిపాయ చిదగ్గొట్టివేసి, ఒక ఎండిన మిరపకాయముక్క, సాలెపట్టుకూడా చేర్చి, మరగబెట్టాలి. కొద్దిగా చల్లారినతర్వాత చెవిపట్టే వేడి చూసుకుని, పోటుగావున్న చెవిలో వేసుకుంటే, పోటుమాట మరివుండదు!

ఎలుకలను పట్టే ఏకైక సాధనం వుల్లిపాయ! ఉల్లిపకోడీ, ఉల్లిగారె పెడతామనుకోండి! ఇవి ఏవీ సమయానికి చేతిలో లేనప్పుడు వుట్టి వుల్లిపాయపెట్టినా ఎలుకలు పడతాయి. ఉల్లిపాయ ప్రధానాంగంగా ఉండే పిండివంట పకోడి. ఉల్లిపాయ లేనిది పకోడికి పరిపూర్ణత్వం పొసగదు! అప్రస్తుతమైనా చిలకమర్తివారు పకోడీలమీద చెప్పిన పద్యాలు కొన్ని పరికించండి:

క॥ వనితల పలుకులయందున
వనిమిషలోకమున నున్న దమృత మటం
జనులను పోగాని లేదట [యు
కనుగొన నీయందమృతముగలదు పకోడీ!

క॥ నీ కరకర నాదంబులు
మా కర్ణామృతము నీదు మహా
మా కనుల చందమామగ [కృతియే
నే కోనియ్యా డెదను సుమ్ము నిన్ను పకోడీ!

క॥ ఎందుకు పరమాన్నంబులు
ఎందుకు పలు పిండివంటలెల్లను ఛీ! నీ
ముందర దిగదుడుపున కని
యందును సందియము గలుగ దరయ
[పకోడీ!

క॥ పురహరుడు నిన్ను దినుపెడ
గరుగడె యొక వన్నె వలుపుగళమున
దురుడున్ దినిన కళంకము [మురి
గరుగక నిన్నాళ్లు నుండగలడె పకోడీ!

పకోడీప్రభావం పరిశీలించారుగదా! [illegible]
మతం గురించి పూర్వం మహా ఘోర[illegible]

## ఉసిరి ఆవకాయ

ఉసిరికాయల ఆవకాయ చాలాబాగుంటుంది. అది పెట్టేవిధానం:

ముందుగా మనం ఎన్ని సేర్ల ఉసిరికాయ పచ్చడి పెట్టుకోవాలో నిర్ణయించుకోవాలి. ఓసేరు ఉసిరికాయల పచ్చడి పెట్టుకోవాలి అనుకుందాం.

ఉసిరికాయ లన్నింటినీ ఓ గిన్నెలో వేసి, ఓ గరిటెడు నూనివేసి, పొయ్యిమీదపెట్టి బాగా వేగనివ్వాలి. ఉసిరికాయలు వేగిన తర్వాత కిందపెట్టెయ్యాలి.

తర్వాత అంతా, మామూలుగా ఆవకాయ పెట్టే విధానమే. ఆవగుండా, కారంపొడీ, ఉప్పు, పసుపు, ఇంగువ, మెంతిపొడి, వెల్లుల్లిపాయలు సరియైనపాళ్ళలో కలిపి వెయ్యాలి. వేగిన ఉసిరికాయలను ఆ పొడిలో కలిపి, జాడీలోకి ఎత్తి, నూనెపొయ్యాలి. రెండు మూడు రోజులతర్వాత అవి బాగా ఊరుతాయి.

ఉసిరికాయ ఊరుతుందికాబట్టి, కాయని చేతితో నొక్కగానే చక్కగా నాలుగు ముక్కలు అయిపోతుంది. పచ్చడికూడా చాలాబాగుంటుంది. మామిడికాయ పులుపు అంత పులుపు ఉసిరికాయకి ఉండదుకాబట్టి "ఆవకారం" తగ్గించివెయ్యాలి. ఇదీ "ఉసిరి ఆవకాయ".

పి పూర్ణిమ,
(విజయవాడ)

పోట్లాటలు జరిగాయి. శైవ మతస్థులను చూస్తే, వైష్ణవమతస్థులకు పడదు. వైష్ణవులంటే శైవులకు కిట్టదు. శైవులు శివనామం తప్ప, వేరే ఏ దేముడిపేరైనా చెవిని పడుతుందేమోనని, ఒంటినిండా గంటలు కట్టుకునేవారట. ఇక వైష్ణవులు, శైవుడు కంట పడతాడేమోనని విసనకఱ్ఱలు మొఖాని కడ్డం పెట్టుకుని వెళ్ళేవారట. మతోన్మాదం ఇంతగా ఉండేది. శివకేశవుల కభేదము పాటించి, హరిహరాద్వైతమతాన్ని వెలయించాడని తిక్కనను ఎక్కువ పొగడుతుంటాము. కాని ఆ కీర్తి న్యాయానికి ఉల్లికే చెల్లుతుందనాలి! ఉల్లిని నిలువునా కోసి చూడండి! జంగమదేవర శంఖం చక్కగా కనబడుతుంది. అడ్డగా తరిగితేనో! ఆశ్చర్యం! విష్ణ్వాయుధమైన చక్రం వుంటుంది! ఈ రహస్యాన్ని ఉల్లిపాయ ద్వారా ఉటంకిస్తూనే వున్నాడు భగవంతుడు. మానవులం అజ్ఞానంలో పడి వుల్లిలోగల మత సామరస్యాన్ని గుర్తించలేక ఉపేక్షించి శిక్షా పాత్రులమైనాము.

ఇక దీని ఉపయోగాలకు వద్దాం. సర్వసాధారణంగా వుల్లిపాయలను కూరల్లో పోపు పెట్టుకుంటారు. కమ్మగా కావాలను కూరలకు, వుల్లికారం నూరి పెడుతుంటారు. దీన్నే "ఉల్లిముద్ద" ని "మసాలా" అని వ్యవహరించడం కద్దు. పై మాటిలో చిల్లర వస్తువులలో తేడావుంటే వుండవచ్చును గాని, ప్రధాన భాగం వుల్లిపాయలదే. వెల్లుల్లిపాయల కూరను ప్రత్యేకంగా బాలింతలకు పురిటిలో "పథ్యంగా" పెడతారు. వెల్లుల్లిని ఆవకాయలో వేసుకుంటారు. ఆ వూటలో వూరిన యీ వెల్లుల్లి పాయలు, తినడానికి, చాలా కమ్మంగా వుంటాయి. వెల్లుల్లికి బదులు కొందరు వుల్లి విద్వేషులు సెనగలు వేసుకుంటారు. కాని, అవి "పులిని చూసి నక్క వాతలు పెట్టుకున్నట్టే" వుంటాయి. ఉల్లిపాయ, బంగాళా దుంపకూర, పూరీలోకి ప్రసిద్ధి కెక్కింది. కేవలం వుల్లిపాయలను మాత్రమే కూరగాను, పులుసుగాను చేసుకుంటారు. ఉల్లిపాయపులుసు కోసం ఎగబడ్డ ఎలుగుబంటి కథ మీరు చదివేవుంటారు. లోకంలో ఉల్లిని చేర్చిన పిండివంటకొక ప్రత్యేకత ఏర్పడి పోయింది.

ఉల్లిగడ్డసారం గొడ్డుకు తెలిసింది. మెదడున్న మానవుడికి తెలియలేదంటే మానవజాతి కెసిగ్గుచేటు. మానవులు కొందరు, దీన్ని, వాసన భరించలేకనో ఏమో, వెలివేశారు. తల్లిలాంటి వుల్లికి, మల్లిలాంటి మంచి సువాసన లేకపోవడం మనస్సుకు ముల్లులా గుచ్చుకుంటుందంటే కల్ల కాదు! ఈ 'వాసనే' వుల్లికి వరంలాంటిది. ఉల్లికి క్రిములను చంపేగుణం వుంది. అది ఈ వాసన వల్ల నేనట. ఉల్లిని తరుగుతుంటే 'ఘాటైన' యీ వాసనకు బొటబొట కన్నీళ్ళు కారుతాయి. వంటింట్లో వనితలు కార్చే కన్నీటికి "ఘాటే" కారణం.

దీన్ని మనవాళ్లు "ఉల్లికి దిక్కూ మొక్కూ లేదు. అందుచేత ప్రతివారు కన్నీళ్లు కారుస్తా"రని చమత్కరించారు.

ఉల్లిపొట్టును వూరికే పనికిరాదని పారబొయ్యకు! ఇది మంచి ఎరువు! గులాబి మొక్కలకీ వుల్లిపొట్టు వేస్తే, గుబురుగా పెరిగి ఘుమఘుమల గుబాళింపుతో గులాబీలు కాస్తాయి. వెల్లుల్లిపొట్టును, పసిపిల్లలున్న యింట్లో, రోజూ కుంపట్లో వేసి పొగవేస్తారు! ఆ వాసనకు దెయ్యాలు రావని ఒకనమ్మకం. ఉల్లిపాయ పైనుండే పైపొర, చూడడానికి చాలా నాజూగ్గా, సన్నగా వుంటుంది. అందుకనే మనం చప్పున 'పల్చటిబట్టను చూడగానే "ఉల్లిపొర" లా వుంది అంటుంటాం. సన్నానికి ఉల్లిపొర ఉపమానం అయిపోయింది. ఉల్లిని చేన్లో పాతగానే, పైకి పొడుగాటి కాడలు మొలుస్తాయి. వీటిని 'ఉల్లికాడలు' లేక కోళ్లుఅంటారు. ఈ కాడలను కోసి, కట్టలుకట్టి, ఉల్లిపాయల మాదిరే బజార్లో అమ్ముతుంటారు. వీటిని కూడా కూరల్లోను పులుసుల్లోను వాడుకుంటారు.

'వాసన' ఒక్కటే ఉల్లికి వచ్చినలోటు. ఆమాట కొస్తే వంకలేని వస్తువే లోకంలో లేదు! కొండగోగుపువ్వును చూసి కాళిదాసంతటివాడు "అయ్యో! దీనికి యింత అందం వుండి, వాసనలేక పోయెనే" అని విచారించి, "ప్రాయేణ సామగ్ర్య విధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః" అని బ్రహ్మగారిమీద బ్రహ్మాస్త్రం లాంటి మాట ప్రయోగించాడు. కుసుమానికే కష్టాలు తప్పనప్పుడు తల్లిలాంటి వుల్లికి 'వాసన' వుండడంలో వింత లేదు!



క్రాస్ స్టిచింగ్ : అంచుకు

—జంధ్యాల, సరోజ ద్రోణాచలం

ఉల్లికి పుట్టిల్లు అట్లాంటిక్ మహాసముద్రంలో వెస్ట్ ఇండీస్‌కు, నోవా స్కోషియాకు మధ్యగా నున్న 'బెర్ముడాస్, అనే బ్రిటిషు దీవులు.

ఓ ఆంధ్ర యువతీ యువకుల్లారా! మీకిదేమా హెచ్చరిక! మీరు వూరికే గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోక పెల్లుబికిన ఉత్సాహంతో వూరూరా వెల్‌ఫేర్ సెంటర్లాగ ఉల్లి కేంద్రాలను స్థాపించి ప్రజలకు వుల్లి వుపయోగాలను వివరించి చెప్పండి. ఆంధ్రులకు ఉల్లిమీద 'అభిమానం కొల్లలు! పెద్దల పేర్లు పిల్లలకు పెట్టినట్లు, ఉల్లిపేరు పేటకు పెట్టిన ప్రఖ్యాతి రాజరాజనరేంద్రుడికి రాజధానియైన రాజమహేంద్రవరానికే చెందాలి. ఆవూరిలో ఉల్లితోట వీధి అని ఒకవీధి వుంది!

ఉల్లి కంపు మెల్లి మెల్లిగా యింపుగా మారుతుండడం ముదావహమైన విషయం. ఈ కలికాలంలో ఉల్లిలేని యిల్లులేదనడం కల్ల! అయినా అక్కడక్కడ వుల్లిని వెలివేసే వెఱ్ఱులున్నారు! వారిని వుల్లికి దాసులనుచేసి, యింటింటా వుల్లి వెలుగొందేటట్టు చేసే మహత్తర బాధ్యత మీమీద వున్నది.

ఉల్లికి ఉజ్జ్వలమైన భవిష్యత్తు కనుచూపుమేరలో వుంది! ఉల్లిగడ్డకు గడురోజులు

(41-వ పేజీ చూడండి)

# ★ స్థూలత్వం తగ్గడానికి ★

(36-వ పేజీ తరువాయి)

## స్థూలత్వానికి కారణాలు

కొన్ని కుటుంబాలలో స్థూలత్వం వారసత్వంగా వస్తోంది. అంటే కొవ్వుపదార్థాన్ని వినకెయ్యడం జరుగుతోందన్నమాట. అందుకు కారణం గ్రంథులలో ఏదో లోపం ఉండడం అని అంచనా వేస్తున్నారు. కొన్ని గ్రంథులకూటమి ముఖ్యంగా థైరాయిడ్, పిచుటరీ స్త్రీ పురుష గ్రంథులు ఇందులో పాల్గొంటాయి. మనం పుచ్చుకొనే ఆహారం, మనం ఖర్చుచేసే పోషక పదార్థం ఈ రెండిటికీ సామరస్యం కుదిర్చే శక్తి ఈ గ్రంథులకు ఉంటుంది. కాని ఈ గ్రంథులలో ఏదో తేడా రావడం మూలకంగా అవి మితంగా గాని అపరిమితంగా గాని పని చేసి ఈ సామరస్యాన్ని చెడగొడతాయి. అందువలన తీసుకొన్న ఆహారం శక్తిగా ఖర్చుగాక క్రొవ్వుగా చర్మంక్రింద నిలబడిపోతుంది. స్త్రీ గ్రంథులకు సంబంధించికూడా ఈ మార్పు ఉంటుంది. కాబట్టి మనలో కొందరు యౌవనం ప్రాప్తించేసమయంలో స్థూలకాయులైపోతారు.

## ఈ సూత్రం మాత్రం

అయితే నవీన శరీరవ్యాపార శాస్త్రాన్ని అనుసరించి (శరీరానికి అవసరమైన ఆహారం కంటె అధికంగా భుజించడంవలన క్రొవ్వు శరీరంలో దిగబడిపోతోందని) యీ సూత్రం మాత్రం కొందరి సోదరీమణుల విషయంలో నిజమే! ఆ సోదరీమణులు ఎవరంటె నలభై ఏళ్ళ ప్రాయం ప్రాప్తించినవాళ్లు. కూతుళ్లు ఎదిగిరావడంవలనా, కోడళ్లు అందిరావడం వలనా విశ్రాంతిదొరికి కొంచెం అధికంగా భుజిస్తూవుంటారు. అందువలన నలభైయేళ్ళ ప్రాయంలో శరీరం కొంచెం స్థూలత్వం పొందుతుంది. అంతేకాకుండా నలభైయేళ్లు దాటాక మనలో కొన్ని గ్రంథులలో తీవ్రమైన మార్పులు జరుగుతూ ఉంటాయి. ఈ మార్పులు కారణంగాకూడా స్థూలత్వం ఏర్పడవచ్చు.

పైచెప్పిన అనేక కారణాలలో అతిసాధారణమైన కారణం అవసరాన్ని మించి భుజించడం. ముఖ్యంగా క్రొవ్వును వృద్ధిపరచే పదార్థాలు తినడం. ఈ కారణం ఎంతిచిన్నదిగా, తేలికగా అగుపిస్తుందో, అంత సులభంగానూ యీ సమస్యను పరిష్కరించుకోగలం.

స్థూలత్వం ప్రాప్తిస్తున్న ప్రారంభంలోనే ఆహారంలో మార్పులు చేసుకొని దుష్టమైన క్రొవ్వునుండి కాపాడుకోడం సులాయాసం ఉత్తమంకూడా. ప్రప్రథమంలో మేల్కొనడంద్వారా ఆకారాన్ని, ఆరోగ్యాన్ని, అందాన్ని, ఆనందాన్ని, చురుకుతనాన్ని కాపాడుకోగలం.

## బరువును తగ్గించుకోడం ఎలా?

సరిఅయిన బరువును నిలుపుకోవాలంటే భుజించే ఆహారానికీ, ఖర్చుచేసే శక్తికీ ఒక సామరస్యం ఏర్పడాలి. అలా కాకపోయినట్టయితే మనపని ఒక రబ్బరుబుడగ అయిపోతుంది. ఊదురుగొట్టాన్ని నోటివద్ద పెట్టుకొని ఊదుతాం. ఒక వైపునుండి ఊదేగాలి రెండోవైపునుండి పోతుంది. అంటె సామరస్యంఉంది. రబ్బరు బుడగను ఒకవైపునుండి గాలి ఊదుతాం. రెండోవైపునుండి గాలి పోవడానికి వ్యవధిలేదు. అందుకోసం రబ్బరు సాగి పెద్దదవుతుంది. కారణం ఏమంటే సంపించేగాలికీ ఖర్చయ్యేగాలికీ సామరస్యం లేదు. ఇదే పరిస్థితి మన శరీరానికీ కూడా ఏర్పడుతుంది. భుజించే ఆహారానికీ ఖర్చయ్యే శక్తికీ, సామరస్యం ఉండాలి. కాబట్టి శరీరం అపరిమితంగా పెరిగినవారికి రెండువిధాలైన కార్యక్రమాలు మనం సూచించాలి. మితంగా భుజించడం, తగినట్టుగా పరిశ్రమించడం. అంటె శరీరం తగ్గించడంకోసం ఆహారాన్ని తగ్గించి వ్యాయామాన్ని పెంచాలి. వ్యాయామం అంటె నడకే కాకుండా క్రిందటి వ్యాసంలో నేను సూచించిన వ్యాయామక్రియలుకూడా అనుసరించాల్సి ఉంటుంది.

## ఆహారం, స్థౌల్యం

ఆహారాన్ని తగ్గించడంలోకూడా ఒక పద్ధతిఉన్నది. మాంసకృత్తులను తగ్గించనవసరంలేదు. అంటె పప్పు, గోధుమతినవచ్చు. తగ్గించాల్సిందల్లా వరి అన్నం, దుంపలు, పంచదార, కొవ్వు, నూనె, నెయ్యి, పాలు.

శరీరాన్ని తగ్గించడంలోకూడా పరిమితి ఉంది, బలవంతంగా పరిమాణాన్ని తగిస్తే చర్మం ముడతలుపడి తితివలె వికార ఆకారాన్ని ఇస్తుంది. ఈ తగ్గించడం క్రమపద్ధతిలో ఉండాలి.

శరీరాన్ని తగ్గించడంలో కళ్లు తిరగకూడదు. కళ్లు చీకట్లు కమ్మకూడదు. అలా అయినట్టయితే అనేక అవాంతరాలు కలుగుతాయి. శరీరానికి కొవ్వును కలిగించేవి



"అరె! నా బరువుసున్నా పౌనులు!"

కొవ్వు, వెన్న, నెయ్యి. నూనె, రొట్టె బంగాళాదుంపలు, చిరుగడ దుంపలు, అరటిపండ్లు, పంచదార, చాకులెట్లు, పాలు మొదలైనవి.

కొవ్వును పట్టనివ్వకుండా సక్రమ ఆహారంగా ఉపయోగించేది ఆకుపచ్చని కూరగాయలు, ఆకుకూరలు, ఈత, కర్జూర, మాంసము, చేప, టొమెటో, అరటితప్ప అన్ని పండ్లు.

## కొన్ని చిట్కాలు

ఒక నారింజపండురసం ఒకగ్లాసుడు వేడినీటిలో పిండాలి. నిద్ర లేవగానే పుచ్చుకోవాలి. పంచదార కలుపకూడదు.

నాస్తా: గోధుమరొట్టెలు, నారింజపండు, టీగాని, కాఫీగాని (పంచదార, పాలు తగ్గించాలి.)

భోజనం: గోధుమఅన్నం. టొమెటో కూరలు, నిమ్మదబ్బ, అవకాయ మొదలైన పచ్చళ్లు, గోంగూర, బచ్చలి, తోటకూర, కాకరకాయ, పొట్లకాయ మొదలైనకూరలు.

సాయంకాలం: పంచదార, పాలు మితంగాఉన్న కాఫీగాని, టీగాని, గస్కాలు, పూరీలుకాని, చపాతీలుకాని.

రాత్రి: గోధుమఅన్నం కాశేజీ మొదలైన ఆకుకూరలు.

నిద్రకుముందు: పంచదార లేకుండా వేడినీటిలో నారింజరసం.

## ప్రశ్నలకు జవాబులు

(లోగడ ప్రచురించిన 'వ్యాయామం' అనే వ్యాసంపై)

ప్రశ్న: వ్యాయామం ఉదయమే చెయ్యాలా? సాయంత్రమైనా చెయ్యవచ్చును అంటారా? ఎటువంటి ఆహారం మంచిది?

డి. లలిత.

జవాబు: ఉదయం చేయడం ఉత్తమం, సాయంకాలంకూడా వ్యాయామం చేయడం వాంఛనీయం. ఉదయం వ్యాయామం సంపూర్తిగా మాని సాయంకాలం మాత్రమే చేయడంమటుకు అంత క్షేమకరం కాదు. పరిపడని సమయాలలో సాయంకాలం మాత్రమే వ్యాయామంచేయడం ప్రమాదకరమేమీ కాదు.

వ్యాయామం చేసినతరువాత విశ్రాంతి తీసుకోవడం శ్రేయస్కరమైనదే. సందేహం లేదు

వ్యాయామానికి ముందు ఆహారం పుచ్చుకోవడం మంచిదికాదు. వ్యాయామానంతరం మీ రడిగినట్లు పాలు పుచ్చుకోవచ్చు. పాలే కాదు; బాదం, జీడిపప్పు, కిస్‌మిస్, ద్రాక్ష మొదలైనవీ, పప్పుధాన్యాలూ భుజించవచ్చు.

చన్నీటి స్నానంచేసే కంటె మన శరీరం వేడిమికి సమానమైన ఉష్ణోగ్రతకలిగిన నీరు - అంటే గోరువెచ్చని నీటిలో స్నానం చేయడం మంచిది.

ఒక్కొక్క వ్యాయామక్రియ ఎన్నిసార్లు చేసినా పరవాలేదు. కాని మీ వ్యక్తిగతమైన ఓపికను అనుసరించి మాత్రమే చెయ్యాలి. ప్రారంభంలో స్వల్పంగా చెయ్యడం, క్రమేపీ అభివృద్ధిచేయడం సక్రమమైన పద్ధతి, మంచి పద్ధతి.

మీరు చేస్తున్న అయిదురకములైన వ్యాయామక్రియలు, మీరు చెప్పిన వరుస, సక్రమంగానే ఉన్నాయి.

నడుమును గురించి మీరు వ్రాసిన వ్యాయామ క్రియలను కొంచెం వివరంగా చెబుతారా?

కె. శారద.

పాదాలను రెండడుగుల దూరంలో ఉంచుకోవాలి. తిన్నగా నిలబడాలి. రెండు చేతులూ తలకుపైన పూర్తిగా ఎత్తాలి. రెండు బొటనవ్రేళ్ళూ లంకెలు వెయ్యాలి. ఇప్పుడు ఆ పాదమస్తకం నిటారుగా ఉన్నట్టే. ఇప్పుడు ఎడమవైపుకు గుండ్రంగా వంగాలి. అంటే చేతులు నిటారుగా సాచిఉంచి నడుమును మాత్రమే ఎడమకు వంచి చేతులను క్రమేపీ నేలవైపు వొంచాలి. (చేతులు నిటారుగానే ఉండాలి). ఈ క్రియ చేసేటప్పుడు కాళ్ళు వొంగరాదు. కదలరాదు. నడుముభాగము మాత్రమే ప్రక్కకు వంగాలి. తద్వారా రొమ్ము, చేతులు భూమివైపు మళ్ళుతాయి. మళ్ళీ నిటారుగా వచ్చాక ఈ క్రియ కుడివైపుకు చేయాలి. జాగ్రత్తగా చేయాలి సుమా. స్వల్పంలో ప్రారంభించాలి. మొదటిరోజు 5 సార్లకంటె అధికం వద్దు.



## ఉల్లి - వెల్లుల్లి

(39-వ పేజీ తరువాయి)

పోయి, రాజయోగంపట్టింది! "ఉల్లిగడ్డకు నాశ గురువు వచ్చును" అని కాలజ్ఞానంలో బ్రహ్మంగారు చెప్పినమాటలు నిజమయ్యేరోజులు వచ్చాయి. ఉల్లిపాయల పరిశోధనకు ప్రభుత్వం పూనుకోవడం ప్రశంసించదగ్గ విషయం. ఇటీవల (6-5-1957) ఆంధ్రపత్రికలో యీ క్రింది విషయం ప్రకటించబడింది.

"ఉల్లిపాయల పరిశోధనా కేంద్రాన్ని అయిదేళ్ళ పర్యంతం స్థాపించటానికి ఒక పథకాన్ని ప్రభుత్వం మంజూరుచేసింది. దీనికి 92820 రూ॥ ఖర్చు అవుతుంది. ఈ పథకాన్ని కడపజిల్లాలో గంగరాజపురంవద్ద గల ప్రభుత్వ బంజరుభూమిలో నిర్వహిస్తారు. దీని వ్యయమును భారతీయ వ్యవసాయ పరిశోధనాసంస్థ, రాష్ట్రప్రభుత్వము కలిసి భరిస్తారు. భారతీయ వ్యవసాయ పరిశోధనాసంస్థ 6400 రూ॥ వరకు భరిస్తుంది. ఆదాయాన్నిమాత్రం రాష్ట్రప్రభుత్వము, పరిశోధనాసంస్థ సమానంగా పంచుకొంటవి."

అందుచేత ఎల్లరు వుల్లిని వాడివేయక ఉపయోగించండి!!



# రోజూ ఓ గంటసేపు....

మొన్న పరీక్షలు వ్రాసి సెలవలకు ఇంటికొచ్చాను. ఆంధ్రపత్రిక తెల్లవారే చదువుతున్నాను. మా బామ్మ లోపలి నుండివచ్చి మా నాన్నను పిలిచి చెప్తున్నాది. "చూచావట్రా! ఆడంగులకు చదువు వద్దంటే విన్నావా! అది చూడు కాలిమీద కాలు వేసుకొని ఎలా చదువుతున్నాదో పేపరు, అయితే యిది కాపరం చేస్తుందనేనా నీ అభిప్రాయం" అంది. ఇలావుంది ధోరణి. ఆడవాళ్ళు పేపరు చదవడానికి అర్హులు కారని ఆ అర్హత లేదో అది మగవాళ్ళకేనని చాలా మంది భావం. ఈ విధమైన మూఢ ఆచారాలతో బయట ప్రపంచంలో ఏమి జరిగేదీ తెలియక వారి ధోరణిలో నే నడుస్తుంటారు. ఇది యిలా వుంటే మరికొందరు మహిళలు వారి వంట యిల్లేమో వారేమో, అంతే కాని మరి యే యితర విషయాల్ని పట్టించుకోరు. 20 వ శతాబ్దం ఉత్తరార్ధంలో కూడా, మహిళలు సమానహక్కులు బడసిన ఈ రోజున కూడా, మనవాళ్ళు చాలమంది రాజకీయ విషయాలు తెలుసుకోకుండ ఉండడం విచారకర విషయం. ప్రతిమహిళ రోజూ ఒక గంట పత్రిక చదవడం అత్యావశ్యకం.

డి. మనోరమ (గూడూరు.)



## ఆస్పత్రిలో అవస్థలు

24-4-57 వనితాలోకం శీర్షిక క్రింద పాకల సీతగారు వ్రాసిన వ్యాసంతో నేను ఏకీభవిస్తున్నాను. ఈ సమస్యనే నేను ఒక పెద్దాసుపత్రికి ఎగ్జామిన్ చేయించుకుందుకని వెళ్లేను. నన్ను ఒక లేడీ డాక్టరు ఎగ్జామిన్ చేసి రెండు రోజులు పోయినతర్వాత మళ్లీ రమ్మన్నారు. రెండురోజులు అయిన తర్వాత తిరిగి వెళ్లేము. ఆ రోజు ఆమె డ్యూటీ కాదు కనక తిరిగి రెండు రోజులు అయిన తర్వాత మళ్లీ రమ్మన్నారు. రెండు రోజులు అయిన తర్వాత మళ్లీ వెళ్లాము. ఆ రోజేదో సెలవు కాబట్టి మళ్లీ రమ్మన్నారు. మళ్లా వెళ్లేము. ఆ రోజు ఎలాగైతేనేం ఎక్స్-రే తీసి, మళ్ళీ రెండురోజులు అయిన తర్వాత రమ్మన్నారు. మళ్లా వెళ్లాము. అక్కడ డాక్టర్సు ఎవరి మట్టుకు వాళ్లే తెల మొహం వేసి ఎక్స్-రే పోయింది, గనక మళ్లీ తీస్తాము- మళ్లీ రమ్మనమని చెప్పేరు. దీనితో మాకు చాల చికాకు వేసి దీని పద్ధతి తెల్సి, ప్రయివేటు డాక్టరుద్వారా వైద్యం చేయించుకున్నాము

పెద్ద ఆసుపత్రులకోసం అని పొరుగూరు నుంచి వచ్చి అక్కడ మకాంలు పెట్టుకుని వుండే వాళ్లకి అన్ని విధాల చాలా అవస్థగా వుంటుంది. పెద్ద పెద్ద గవర్నమెంట్ హాస్పిటల్స్‌లోనే ఇటువంటివి జరుగుతూ వుంటే, చిన్న చిన్న హాస్పిటల్స్ సంగతి వేరే చెప్పవలసిన అవసరం లేదు.

ఎ. రంగ, (గూటాల)

* * *

## మార్పులు; చేర్పులు

పంజాబీ వంటకాలలో కొన్నిటని సుగుణ గారు యీ సంచికలో ముచ్చటించినవిధంగా చేసి చూచాము. పంజాబీలకు చాలా ఇష్టం అని చెప్పిన 'ఛోలే' కూర మన ప్రాంతం వారికి అంతగా నచ్చేదేమో అని అనిపించుతుంది. మినప్పప్పు కలవటాన ఆ కూరకు జిగురు యేర్పడి రుచికి గారెలపిండి లాగున ఉంది. మినప్పప్పు నానబెట్టి వాడుకునే బదులు వేయించితేనే బాగుండును. కాని ఇంతకూ కూరచేసే పద్ధతి ఒకటే యేలుక పడటం వల్ల ఎవరెవరి యిష్ట ప్రకారం వారు ఆయా మార్పులు చేసికొంటే సరిపోతుంది. అల్లం కొత్తిమేర వగైరాలకు తోడు పచ్చి కొబ్బరి కూడా జేర్చితేనూ, చివ్వరకు కొస్త నిమ్మరసం కలుపుతేనూ, ఆ కూరకు మరింత రుచి వస్తుంది.

కా. ఇందిరామోహన్,
(తుంగభద్ర డాం)

* * *

## "మెప్పుకోసం"

నెల్లూరునుండి కుమారి యమ్. యస్. రోజాగారు 3-4-57 ఆంధ్రపత్రిక "వనితాలోకం" శీర్షికలోని "మెప్పుకోసం" అనే వ్యాసం చాలా చక్కగా వ్రాశారు. ఆమెతో నేను పూర్తిగా ఏకీభవిస్తాను. ఈరోజుల్లో కొందరు సోదరీమణులు వారిపని వారు చేసుకొనుటకూడా ఒక పెద్ద నేరమల్లే భావిస్తారు. కుమారి రోజాగారు వారి హెడ్ మిస్ట్రెస్ ఇంటికి వెళ్ళితే ఆమె పట్లు దులుపుకుంటూ వున్నారని వ్రాసేరు. నిజమే. ఎవరిపని వారు స్వయంగా, ఒకరిపై పెట్టకుండా చేసుకొనుటలోనే ఎంతో హాయివున్నది. కొందరు వ్యక్తులు ఇంట్లో ఎంతపనైనా చేస్తారు. ఎటొచ్చీ వారు అట్లా పనిచేస్తున్నట్లు అవతలవారికి తెలిస్తే నామోషి.

గంటి రోహిణి,
(విజయనగరం)

* * *




# మరదలు సరదా

మరదలు

బావగా రొచ్చారు!
బరువు సంచులతోటి
అక్కయ్య రావమ్మ
అందుకొని పోవమ్మ.

బావ

అక్కయ్య ఎందుకే
చక్కడపు బొమ్మా!
రావె! మరదలుపిల్ల
తీసుకొని పోవే!

మరదలు

ఎందుండి వచ్చారు
ఏమేమి తెచ్చారు?
మోదముతో చెప్పండి
మోదముగ వింటాము

బావ

[illegible] తెచ్చాను
పట్టుచీరెల కొరకు

వినవె! మరదలుపిల్ల
ఓ కోతిపిల్లా!

మరదలు

నగలెన్ని తెచ్చారు?
పట్టుచీరెలు ఎన్ని?
చెప్పండి ఇప్పుడే
తెచ్చినవి ఏమో!

బావ

ఇంపైన ఇత్తడివి
నగలెన్నొ తెచ్చాను.
పెట్టుకోవే పిల్ల
పట్టుచీరను గట్టి.

మరదలు

ఎంతో అలిసొచ్చారు
ఎన్నెన్నొ తెచ్చారు.

బావ

అవునె మరదలుపిల్ల
అలిసి నేనొచ్చాను

అక్కతో చెప్పవే
తేనీరు తెమ్మనవె!

అంత మరదలుపిల్ల
పరుగెత్తి వెళ్ళినది
పట్టుకొని వచ్చినది
పడకకుర్చీ ఒకటి.

కులుకుతూ ఆ బావ
దర్జాగ వెళ్ళాడు
కుర్చీలో కూర్చొనుచు
పిల్లిమొగ్గ వేసె!

అప్పుడే వచ్చినది!
అక్కయ్య చూచింది!
చిరునవ్వు నవ్వింది!
చప్పట్లు కొట్టింది!

వోలేటి శేషాచార్యులు

# నిజమైన వీరుడు

అలెగ్జాండరు చక్రవర్తిని గురించిన కథలు చదవనివారు చాలా తక్కువమంది. ప్రపంచ చరిత్రలో మేటి వీరుడు, ధీరుడు అనిపించుకొన్నాడు. ఎన్నో స్సామ్రాజ్యాలను ఆక్రమించాడు. ఎంతోమంది రాజులను, రారాజులను ఓడించాడు. ఆయన కీర్తి దిగంతాలకు పాకిపోయింది. అలాంటివాడే నెపోలియన్. అప్పటి ఫ్రాన్సు చరిత్ర అధికభాగం ఆ నెపోలియన్ జీవిత చరిత్రలో కేంద్రీకరింపబడి వుంది. ప్రపంచం వాళ్ళను "జగద్విఖ్యాత వీరులు" అన్న పేరు వేనోళ్ళ కొనియాడుతుంది. చరిత్రలో ఎక్కువ పేజీలు ఇటువంటి కఠినులయిన వీరులగాథలతోనే నిండివుంటాయి.

నిజానికి 'వీరత్వం' అనే పదం చాలా పవిత్రమైంది. స్వార్థపరులెప్పుడూ నిజమైన వీరులు కాలేరు. అటువంటివారు వేరే వున్నారు. వారిలో కొందరు ఆచరణలో వీరులనిపించుకొన్నారు. అలెగ్జాండరు, నెపోలియన్‌లాంటివారు మానవత్వానికి గొడ్డలిపెట్టులాంటి వాళ్ళు. వాళ్లకు నాశనం చేయటం తెలుసు. మానవ మారణహోమం వాళ్ళకు ఆటలాంటిది.

నిజమైన వీరుల్లో మరొకతెగవారున్నారు. వారు బాధను అనుభవించటంలో తమ వీరత్వాన్ని బుజువు పర్చుకొంటారు. అటువంటి ఒక సామాన్యమైన, ఉదాత్తమైన బాలుని వీరగాథను గురించి చెప్తాను.

ఒక వూళ్ళో ఓ తాపీ మేస్త్రీ వుండేవాడు. సంపాదించినదంతా తాగుడికీ, జూదానికీ పెట్టి వుత్తిచేతులతో ఇంటికి వచ్చేవాడు రోజూ. పైగా ఇంటిదగ్గర పెళ్లాన్ని, బిడ్డలను తెగ బాదేవాడు. ఇటువంటి వాళ్లు మన దేశంలో చాలాచోట్ల కనిపిస్తారు.

ఆ తాపీపనివాడికి పద్నాలుగేళ్ల కొడుకు లేకపోయినట్లయితే తిండికి లేక ఆ కుటుంబము అలా మలమలా మాడిపోయేదే. ఆ కుర్రాడు ప్రతి రోజూ ఎక్కడో కూలినాలి చేసి,

## "పైడి"

వచ్చిన డబ్బులు తండ్రికి తెలవకుండా తల్లికిచ్చేవాడు. ఆ డబ్బుతోనే ఆ తల్లి సంసారాన్ని నెట్టుకొచ్చేది. పైగా తండ్రి తెగ తాగి ఇంటికి వచ్చినప్పుడు తల్లి గాని, కడమ పిల్లలు గాని తండ్రిదగ్గరకు వెళ్ళ సాహసించేవారు కాదు. అప్పుడు ఈ కుర్రాడే, తండ్రి బూతులుతిట్టూ మధ్యమధ్యలో కొడుతున్నా సహించి, తండ్రి మైకం తగ్గి, నిద్రపోయేవరకు అక్కడే కూర్చునేవాడు ఎంత రాత్రైనా. అందువల్ల ఆ అబ్బాయి తల్లి వాణ్ణి తమ కుటుంబానికి పెద్ద అండగా చూసుకొంటూ ప్రాణాలన్నీ వాడిమీదే నిలుపుకొని జీవించేది.

ఒకసారి ఆ అబ్బాయి కూలిపనికి వెళ్ళి, అక్కడ, రాళ్ళతట్ట నెత్తిన పెట్టుకొని నిచ్చెన ఎక్కుతుండగ కాలుజారి, తూలి క్రిందవున్న రాళ్ల గుట్టమీద పడిపోయాడు. ప్రక్కనున్నవాళ్ళు సహాయానికి పరిగెత్తేటప్పటికి ఆ కుర్రాడికి స్పృహ పోయింది. తలకు బలమైన దెబ్బ తగిలి రక్తం వరదలు కాసాగింది. తర్వాత కాసేపటికి కొంచెం కళ్ళు విప్పి తన పరిస్థితి తెలుసుకొని— "నేను లేకపోతే నా తల్లి మా సంసారాన్ని ఎలా గడుపుతుంది" అంటూ వలవలా ఏడ్చి మళ్ళా స్పృహ తప్పిపోయాడు.

తర్వాత ఆ కుర్రవాణ్ణి ఆసుపత్రికి తీసుకొని వెళ్ళారు. ఆ వార్త తెలిసినవెంటనే తల్లి గోడుగోడున ఏడుస్తూవచ్చింది. తల్లిని జూచి కళ్లు తెఱచి—

"ఏడవకమ్మా. చప్పున నయమైపోతుంది. నాకేం ఫర్వా లేదు. తగ్గిన వెంటనే పనిలో చేర్తాను. దిగులు పడబోకు" అని ఓదార్చాడు.

దెబ్బతగిలిన దగ్గఱనుండీ తన తల్లీ, వాళ్లు ఏమౌతారన్న చింతేగాని, ఆ కుర్రాడికి తన బాధసంగతే పట్టలేదు. తెల్లవార్లూ దాన్ని గురించే కలవరింతలు! అంత బాధను ఇతరులకోసం ఓర్చుకోవటంలో అతను చూపిన సహనం ఎవరికీ వుండదు. దేవుడి దయవల్ల కొద్దిరోజుల్లోనే అతని గాయాలన్నీ పూర్తిగా నయమైపోయాయి.

ఆ కుర్రాడు ఏమీ చదువుకో

# ఉడత భక్తి

శ్రీరామచంద్రుడు రావణాసురుడి మీదకు దండెత్తాలనుకున్నాడు సీతను విడిపించటానికి. ఐతే, ఎట్లా దండెత్తటం? యుద్ధం చెయ్యటం అంటే మాటలా? ఎంత బలగం కావాలి. ఎంత సైన్యం కావాలి! రావణాసురుడికి బోలెడంత సైన్యం వున్నది - ఆయుధాలువున్నై. అడవిలో కట్టుగుడ్డలతో వున్న శ్రీరాముడు రావణుడితో పోరాడి, జయించి తనభార్యను తెచ్చుకోవాలి. శ్రీరాముడికి మొదట్లో ఇది చాలా చిక్కుగానే కనిపించింది. ఐతే వానరులంతా ఎటువంటి సహాయమైనా చేస్తామని హామీ యిచ్చారు. 'సరే' ననుకున్నాడు రాముడు. అంతలోనే మరో అడ్డొచ్చింది. అదేమిటంటే లంకలో వున్నాడు రావణుడు. తనకూ లంకకూ మధ్య అగాధమైన సముద్రం వున్నది. ఈ సముద్రాన్ని దాటి అవతలకు వెళ్లటం అన్నది ఎంత కష్టమైనపని! ఆ సమయంలో అతనికి ఏమీ తోచలేదు. సముద్రం దాటాలంటే, వంతెనవుండాలి - అదీ చిన్నది పనికిరాదు! సరే, శ్రీరాముడు హనుమంతుడినీ, సుగ్రీవుడినీ, జాంబవంతుడినీ అందర్నీ పిలిచి సలహాలు అడగటం ప్రారంభించాడు. ఒక్కొక్కరు ఒక్కోవిధంగా సలహాలు యిచ్చారు. ఎట్లాగన్నా సరే, వారధి కట్టాలనే నిశ్చయానికొచ్చారు.

శ్రీరామచంద్రుడు పరివారాన్ని కూడోబెట్టుకుని చెబుతున్న మాటలన్నీ ప్రక్కనే వుండి ఒక ఉడత కూడా విన్నది. శ్రీరాముడివంటి గొప్పవాడికి, తనుకూడా ఇంతో అంతో సహాయపడాలనుకున్నది.

**'సుకుమార్'**

ఐతే తను చూస్తే చాలా చిన్న జంతువు. పోనీ, మిగతా కోతుల మాదిరి తనకు చాకచక్యంకూడా లేదు. ఆఖరుకు ఆ ఉడత ఆలోచించి, ఆలోచించి "శ్రీరాముడు ఈ సముద్రాన్ని దాటాలనుకుంటున్నాడు. ఈ సముద్రంలో వుండే నీటిని తీసేస్తే దారి ఏర్పడుతుంది. లేదా బోలెడంత ఇసుకతెచ్చి సముద్రంలో పోస్తే, ఇసుకంతా నిండిపోయి నీరు అడుగున వుండిపోవచ్చు" అనుకున్నది. తను ఒక్కత్తే బళ్లపైన ఇసుకపోసి తీసుకొచ్చి సముద్రంలో పొయ్యలేదు. తనకు సైన్యమూ మనుషులూ ఎవరూలేరు. ఏం చెయ్యటమో దానికి తోచలేదు!

వానరులంతా వారధిని కట్టాలనే నిశ్చయానికొచ్చారు. అంచాత ఎక్కడున్న రాళ్లనూ, బండలనూ, పర్వతాలనూ పెళ్లిస్తూ, సముద్రంలో వెయ్యటం ప్రారంభించారు. ఎంత వేసినా, ఆ పర్వతాలూ రాళ్లూ మునిగిపోతున్నై - ఎన్నితెచ్చినా చాలటంలేదు!

ఈ వానరమూకలో ఒకడున్నాడు. వాడికో వరం వుంది. వాడు చిన్నప్పుడు ఇంట్లో వున్న వస్తువులన్నీ తీసుకెళ్లి రోజూ నీళ్లల్లో పారేస్తూ వుండేవాడట! వాడి తండ్రి రోజూ అక్కడికి పోయి నీళ్లల్లో మునిగిపోయిన ఆ వస్తువుల్ని తెచ్చుకుంటూ వుండేవాడట! - ఐతే నీళ్లల్లో మునిగిపోయినవాటిని వెతికి తీసుకురావటం మహాకష్టంగా వుండేదతనికి. అంచేత అతను తన కొడుక్కు ఓవరం యిచ్చాడు. 'వీడు నీట్లో ఏది వేసినా అది తేలిపోవుగాక!' అని. ఆతర్వాత ఆ వస్తువులన్నీ తేలుతూ వచ్చాయి-అతనూ వాటిని సులభంగా తీసుకునేవాడు!

ఇప్పుడు ఈ వానరుడి అవసరం వచ్చింది. వీడు వేసిన ప్రతీవస్తువు నీటిపైన తేలాలిగదా! అంచేత వాడి చేత కొన్ని బండలు తోయించారు - అవన్నీ తేలసాగినై! ఐతే ఒక్కడూ ఇంతపని చెయ్యటం మాటలా? దానికి ఒక ఆలోచన వున్నది. తన చెయ్యిపడినా, ఆ వస్తువు నీటిలో పడేస్తే తేలుతుందని తెలుసుకుని, ప్రతీరాయిమీదా చెయ్యివేస్తూ, 'శ్రీరామ' అని అక్షరాలు రాస్తూ వాటిని సముద్రంలోకి పంపటం సాగించాడు. అప్పుడు బాగా పని తేలికయింది - వారధి తయారవుతున్నది!

వారధి తయారవుతూంటే శ్రీరామచంద్రుడు ఒడ్డునే కూచుని

## నిజమైన వీరుడు

లేదు. వ్రాయటంకూడా చేతగాదు. కానీ అతనుకూడ నిజమైన వీరుల జాబితాలో చేర్చడానికి అర్హత గలవాడు. అవునా కాదా! చెప్పండి! ★

## ఉడత భక్తి

అంతా చూస్తున్నాడు. చూడగా చూడగా కొంత సేపటికిఆఉడత అతని కంటపడ్డది. అది సముద్రంలో తోక ముంచుతున్నది. తిరిగి వచ్చి ఒడ్డున ఇసుకలో తోక ముంచుతున్నది- మళ్ళీ సముద్రంలో తోక ముంచుతున్నది. శ్రీరాముడికి ఆ ఉడత ఎందు కట్లాచేస్తున్నదో బోధపడ లేదు. "ఏమిటిది - ఎందు కిలా చేస్తున్నావు?" అని అడిగాడు.

ఆ ఉడత ఇలా సమాధానం ఇచ్చింది—

"శ్రీరామచంద్రా! మీరు వారధి కట్టటం చూస్తున్నాను. త్వరగా తయారుకావాలని నాకూ వున్నది. ఐతే, చిన్నదాన్ని ఏం చెయ్యగలను? నాకు తోచిన ఊహా ఏమిటంటే, సముద్రంలో ఇసుకపోయాలని తలచి, నా తోకను ఇసుకలోనూ సముద్రంలోనూ ముంచుతున్నాను. అంచాత ఇసుకను తీసుకెళ్లి సముద్రంలో పోస్తున్నట్టుగదా!"

దాని వూహకు శ్రీరామచంద్రుడు నవ్వుకున్నాడు. నవ్వుకుని "ఎన్ని యుగాలు నువ్వు ఇట్లా చేస్తే, ఈ మహాసముద్రం ఇంకుతుంది?" అని అడిగాడు.

"మహాత్మా! నేనేంచెయ్యను? ఇంతకంటె నేను చెయ్యగలిగే పని నాకు కనిపించలేదు. ఎన్నాళ్లైనా కానివ్వండి-నా సహాయం నేనూ చేస్తాను!" అన్నది ఉడత.

తనమీద ఆ ఉడతకుకూడా ఎంత భక్తి వున్నదో తెలుసుకుని శ్రీరామచంద్రుడు ఆశ్చర్యపడ్డాడు. తన చేతిలోకి దాన్ని తీసుకుని, గోముగా దాని వీపుమీద మూడు వేళ్లతోనూ నిమిరాడు. మూడు చారలు పడినై. అందుకనే ఈ నాటికీ ఉడతవీపుమీద మూడు చారలు కనిపిస్తూ వుంటై! అదీ కథ!



# అన్నదమ్ములు

పూర్వం ఒకఊరిలో నాగయ్యా, లక్ష్మయ్యా అను ఇద్దరు స్నేహితు లుండేవారు. వారు అన్నదమ్ములవలె మెలగేవారు. నాగయ్యకంటే లక్ష్మయ్య ఒక సంవత్సరము చిన్నవాడు. నాగయ్య తెలివిగలవాడు, లక్ష్మయ్య అమాయికుడు. ఏదయినా సంపాదించుకొని రావలయునంటే నాగయ్యే పోయేవాడు.

ఇలా వుండగా ఒక దినము నాగయ్యా, లక్ష్మయ్యతో "తమ్ముడూ, నేను మనవూరికి ప్రక్కనఉన్న పల్లెకు వెళ్ళివస్తాను. ఈలోపల ఈ డబ్బుతో కాలక్షేపము చెయ్యి. ఎవరు వచ్చినా తలుపుతీయవద్దు" అని చెప్పి కొంత డబ్బు ఇచ్చి వెళ్లాడు. ఇదంతా కుక్క రూపములో ఉన్న ఒక రాక్షసి వింది. అది తనలో "ఈ లక్ష్మయ్యను చంపేస్తాను. ఇదే మంచి సమయము" అని అనుకుంది. వెంటనే నాగయ్యా, లక్ష్మయ్యల ఇంటి దగ్గరకు వచ్చి, గొంతు మార్చి, తలుపు తట్టి "తమ్ముడూ, తలుపు తియ్యి, మంచి మిఠాయిలు తెచ్చాను" అని అంది. లక్ష్మయ్య "ఇప్పుడే అన్న వూరికి పోయినాడు, ఇంతలో ఎవరు వచ్చారా?" అని ఆలోచించి తలుపు తీయలేదు. రాక్షసి ఎన్నోవిధముల పిలిచి, ఆఖరుకు విసుగుపుట్టి అక్కడ వున్న కిటికీ విరిచి లోపలికి పోయి లక్ష్మయ్యను తీసికెళ్ళింది. దారిలో "అన్నా, నన్ను రక్షించు. నన్ను రాక్షసి తీసికొనిపోతూంది" అని ఏడుస్తూ కేకలేస్తూ లక్ష్మయ్య వెడుతున్నాడు. ఇంకా సగము దూరము కూడ పోని నాగయ్య ఒక మండుతున్న కట్టెను తీసికొనివచ్చి రాక్షసిని తరిమి లక్ష్మయ్యను రక్షించాడు.

నాగయ్యా, లక్ష్మయ్యలు ఇంటికి వెళ్ళారు. నాగయ్యా, రాక్షసి విరిచిన కిటికీ బాగుచేసి మొదటిసారి

## పి. ఆదిలక్ష్మి

చెప్పినట్టే లక్ష్మయ్యతో చెప్పి వెళ్లాడు. ఈసారి కూడ రాక్షసి వింది. నాగయ్య వెళ్ళగానే తలుపు తట్టింది. లక్ష్మయ్య తలుపు తీయలేదు. తిరిగి కిటికీద్వారా లోపలికి దూకి లక్ష్మయ్యను తీసికెళ్ళింది.

దారిలో లక్ష్మయ్య "అన్నా, నన్ను రక్షించు, రాక్షసి నన్ను తీసికొనిపోతూంది" అని ఏడుస్తూ రాక్షసివెంబడి వెడుతున్నాడు. సగందూరం పోయిన నాగయ్య ఈ ఏడ్పు విని వచ్చి తన లక్ష్మయ్యను రక్షించాడు.

ఇక నాగయ్య మూడవసారి పోయేటప్పుడు "ఒరే! లక్ష్మయ్యా, ఈసారి నేను చాల తొందరగా పోతున్నాను. ఒకవేళ రాక్షసి నిన్ను తీసికొని పోతుంటే నీవు కేకలేసినా, నాకువినిపించదు. కాబట్టి జాగ్రత్తగా వుండు. భయంగావుంటే నాతో కూడ రా!" అని అన్నాడు. లక్ష్మయ్య, తనకేమీ భయము లేదని చెప్పి నాగయ్యను పోగనంపాడు. రాక్షసి తిరిగి వచ్చి "తమ్ముడూ తలుపు తియ్యి!" పిలిచింది. కానీ ఈ "తమ్ముడు" తలుపు తీయలేదు. అది తలుపులు పగులగొట్టి లక్ష్మయ్యను తీసికెళ్ళింది. త్రోవలో తనను రక్షించమని తన అన్నను వేడుకొన్నాడు. కానీ ఆ కేకలు నాగయ్యకు వినిపించలేదు.

రాక్షసి లక్ష్మయ్యను తీసికెళ్లి గట్టిగా కట్టి తన ఇంటిలో పడేసింది. ప్రక్కనే ఒక కుంపటిలో నీళ్ళను కాగబెట్టి, స్నానము చేయుటకు ఒక చెరువు దగ్గరకు వెళ్లింది. ఇంతలో నాగయ్య తన పని ముగించుకొని ఇంటికి వచ్చాడు.

# అన్నదమ్ములు

ఇల్లంతా ఖాళీగా వుంది. "ఇది రాక్షసి చేసిన పని" అనుకొని ఒక పెద్ద సంచి, ఒక పెద్ద త్రాడు తీసికొని రాక్షసి ఇంటికి వెళ్లాడు. తలుపు దగ్గరికి వెళ్ళి తొంగి చూచాడు. అక్కడ రాక్షసి కూతుళ్లు ఇద్దరు ఆడుకుంటున్నారు. వెంటనే నాగయ్య "తలుపు తీస్తే తీయని మిఠాయిలు పెడ్తాను" అని కేకలేశాడు. రాక్షసి కూతుళ్లు వచ్చి తలుపు తీశారు. వారు తలుపు తీయడంతోనే నాగయ్య, వారిద్దరిని తన సంచిలో వేసుకొని, ఆ సంచి మూతి కట్టేశాడు. వెంటనే ఇంట్లోకి పోయి తమ్ముడి కట్లను విప్పి ఇంటికి తీసికెళ్లాడు. ఇంతలో రాక్షసి తన ఇంటికి వచ్చి తన కూతుళ్లు, లక్ష్మయ్య లేకపోవడం చూచి, నాగయ్య ఇంటికి వెళ్ళింది. నాగయ్య ఇంటి తలుపు తట్టి తన పిల్లలను తన కిమ్మని బ్రతిమాలింది. నాగయ్య మొదట ఇవ్వకపోయినా తర్వాత దయతలచి రాక్షసి కుమార్తెలను రాక్షసి కిచ్చాడు. వెంటనే రాక్షసి పెద్దగా ఏడ్చింది. నాగయ్య "ఎందుకు ఏడుస్తున్నా"వని అడిగాడు. "నాయనా! నీ తమ్ముడిని నేను చంపబోయినా, నా పిల్లలను నీవు చంపక తిరిగి నాకు ఇచ్చావు. అయితే నాకు ఒక సహాయము చెయ్యి. నేను ఇక నా పాడు రూపము చాలిస్తాను" అని నాగయ్యను దీనముగా వేడింది రాక్షసి.

అది ఏమిటని నాగయ్య అడిగాడు. రాక్షసి "ఈ రాత్రికి నన్ను, నా పిల్లలను ఒక గదిలో పెట్టి తలుపులు మూసి మమ్మల్ని తగులబెట్టు" మని చెప్పింది. నాగయ్య అదేవిధముగా చేశాడు.

తెల్లవారింది. నాగయ్య ఆ గది లోనికి వెళ్ళి చూచాడు. అక్కడ రాక్షసి, రాక్షసిపిల్లలకు బదులు ఒక తల్లి, యుక్తవయస్కులయిన ఇద్దరు ఆడపిల్లలు పడుకొని వున్నారు. నాగయ్య వారిని లేపి "ఎవరు? ఏమిటి సంగతి" అని ఆమెను అడిగాడు. ఆమె "నేను ఇంతకుముందు చాల బీదరాలిని. ఈ వూరినుంచి ప్రక్క వూరికి పోతున్నపుడు దారిలో ఒక ముని కనుపించాడు. ఆయన అప్పుడు తపస్సులో వుండినాడు. మాకు చాల దాహమగుటచే ఆయన ప్రక్కన వున్న కమండలములోని నీటిని త్రాగాము. నేను త్రాగు సమయమున ఒక నీటి చుక్క ఆయనపై బడి, ఆయన తపస్సు భగ్నమయింది. వెంటనే ఆయన మమ్మల్ని రాక్షసి జన్మము ఎత్తమని శపించినాడు. అప్పుడు నేను ఏడ్చుచున్నపుడు ఆయన తన శాపమునకు తిరుగులేదని చెప్పి, శాపవిముక్తి కూడ చెప్పినాడు. అప్పటి నుంచి రాక్షసులుగా వుండి, ఇప్పటికి తిరిగి మానవుల మయినాము" అని చెప్పింది.

"ఆమె" తను పూర్వము నివసించిన ఇంటికి వెళ్ళి, తను దాచిన ధనము తెచ్చి, తన పెద్దకుమార్తె అయిన కామాక్షిని నాగయ్యకు, చిన్నకుమార్తె అయిన లక్ష్మిని లక్ష్మయ్యకు ఇచ్చి వివాహము చేసింది. 





మహాపురుషుల జీవితాలనుగాని, బాగా ప్రసిద్ధికెక్కిన కథలనుగాని వెండితెర మీదకు ఎక్కించేటప్పుడు, వాటిలో ప్రధాన పాత్రలను ఏనటులకు ఒప్పగించాలీ అన్నదిఒక సమస్య. అటువంటి సమయంలో అందరి అభిమానమూ చూరగొన్న, అందరి గౌరవానికీ పాత్రమైన ఆ ఫలానా పాత్రను, ధరించే పాత్రత ఫలానా నటుడికి గాని నటికి గాని ఉన్నదా లేదా అని చిత్రాలు తీసే వాళ్లూ ఆ తరవాత చూసేవాళ్లూ కూడా ఆలోచిస్తారు

ఈనాడు అనేక చిత్రాల తరహా చూస్తూ ఉంటే, (ముఖ్యంగా తెలుగువి) ఇందుకు విరుద్ధమైన ప్రశ్న ఒకదానికి కూడా జవాబు వెతుక్కోవలని వస్తోంది

మంచి ప్రతిభ, దానిని పూర్తిగా వినియోగించుకోగల తెలివితేటలు, అటువంటి సంకల్పమూ ఉన్న నటీనటులను చూస్తూ ఉంటే, "ఇవి వీళ్లు ధరించతగు పాత్రలేనా, వీటికి ఆ పాటి పాత్రత ఉందా" అని ఆలోచించ బుద్ధేస్తూంది

అఖిలభారత స్థాయిలో చూస్తే అశోక్ కుమార్, గొప్ప నటులలో ఎన్నిక చేసి చెప్పదగినవాడు దేవికారాణితో నాయకుడుగా నటించడం మొదలుపెట్టి, అప్పటి పసిపిల్ల అయిన మీనాకుమారితో, ఈనాడు నటిస్తున్నాడు. గత నాలుగైదేళ్ళుగా అతడు నటించిన పాత్రలలో మెచ్చతగ్గవి చాలా ఉన్నా, తగనివి కూడా కొన్ని ఉన్నాయి.

స్ఫుటమైన రూపురేఖలూ, ప్రయోజనం, బలం లేని పాత్రలనుకూడా అతడు నిర్వహించి నెగ్గుకొచ్చాడు కాని అతని అభిమానులు చాలమందికి అవి హర్షం కలిగించలేదు ఇక, మన దేశంలో తెలుగుసినిమాల పద్ధతికూడా ఈవిషయంలో దాదాపు అలాగే ఉంది. కొన్ని కొన్ని చిత్రాలలో ప్రధాన పాత్రల తరహాలుచూస్తే, ఆ పాత్రను ధరించే పాత్రత ఫలానావాడికి ఉందా అన్న ప్రశ్నకన్న, ఆ పాత్రకు అసలు పాత్రత అనేది ఉందా అని ముందుగా ఆలోచించవలసి ఉంటుం దనిపిస్తూంది.

హీరోకాబట్టి ఆ వేషం వేసేవాని కైదారు సందేశాలు విసిరితీరాలనీ, ప్రజా బాహుళ్యంమీద మంచి ప్రభావం ఉన్న సాధనం గాబట్టి ప్రతిసినిమా ప్రజల్ని కాస్తో కూస్తో ఉద్ధరించితీరాలనీ ఎవరూ అనరు. కేవలం వినోదం కలిగించే చిత్రాలు తగవని తగవు పెట్టరు. కాని, ఉన్నంతలో ఎటువంటి కథకైనా లోపాలు లేకుండా, తీర్చి దిద్దవచ్చు కథలోని ప్రతిపాత్రకూ ఒక

(54-వ పేజీ చూడండి)

భరణీవారి "వరుడుకావాలి" చిత్రంలో భానుమతి, జగ్గయ్య.

ఎన్. ఏ. టి. వారి "పాండురంగ మాహాత్మ్యం"లో పుండరీకుడుగా ఎన్. టి. రామారావు.

# ★ బొంబాయి సినిమా లేఖ ★

బెర్లిన్, కార్లవీవారీ (జెకొస్లొవాకియా), ఎడింబర్గ్ అంతర్జాతీయ చలనచిత్రోత్సవాలలో పాల్గొనడానికి మనవారి సన్నాహాలు దాదాపు పూర్తికావస్తున్నాయి ఈ ఉత్సవాలలో దేశానికి పేరుప్రతిష్ఠలు తెచ్చిపెట్టే చిత్రం ఈసారి రాజ్ కపూర్ చిత్రం "జాగ్ తే రహో"వే నని అనుకొంటున్నారు. ఇక, టోక్యో చలన చిత్రోత్సవాలకు మనవారు పంపిన "హాతిం తాయ్" వంటి చిత్రాలు మాత్రం ఏమంత అఖండమైన కళాఖండాలు కావు స్టంటు చిత్రాలవల్ల దేశానికి కీర్తిప్రతిష్ఠలు వచ్చి పడవు

* * *

బహుళ ప్రజాదరణ పొందిన తమిళ చిత్రం "అమర దీపం"ను (తెలుగులో "అమరజీవి") హిందీలో పునర్నిర్మించడానికి ఆ బృందంవారు మద్రాసు నుండి వచ్చారు కర్దార్ స్టుడియోలో వారు నిర్మాణం సాగిస్తున్నారు ఇందులో దేవానంద్ నాయకుడిభూమిక నిర్వహిస్తాడు పద్మిని, వైజయంతిమాల, హాస్యానికి జానీవాకర్ ఉన్నారు పద్మిని కోయపిల్ల వేషం కడుతుంది వైజయంతిమాల ఆమె సోదరిగా నటిస్తుంది (ఈనైనం చిత్రం చివర కల్లడి అవుతుందన్న విషయం విదిత మే)

పాటలు రాజేంద్రకృష్ణ వ్రాస్తున్నారు. సంగీత దర్శకుడు సి రామచంద్ర.

* * *

శిశూదయానంతరం సన్నబడి, నాజూకు తేలిన కల్పనాఆనంద్, గీతాబాలి రిరిగి కొత్తచిత్రాలలో నటిస్తున్నారు ఉషాకిరణ్ కథ ఇందుకు విరుద్ధంగా ఉన్నందువల్ల, బహుశా ఇటుపై ఆమె నాయకి భూమికలలో కనబడే అవకాశాలు సన్నగిలుతున్నట్లే నని అభిజ్ఞులు అభిప్రాయపడుతున్నారు

కల్పనాఆనంద్ ఇప్పుడు "నౌ దో గ్యారా" అనే చిత్రంలో నాయికగా నటిస్తోంది ఆమెభర్త దేవానంద్ నాయకుడు అతనే ఈ చిత్రాన్ని నిర్మిస్తున్నాడు అతని సోదరుడు విజయ్ఆనంద్ దీనికి దర్శకుడు. అపరాధపరిశోధన ప్రధానంగాగల ఈ చిత్రంలో నృత్యాలు, పాటలు పుష్కలంగా ఉంటాయి శశికల ప్రధాన నర్తకి

ఇక షమీకపూర్ సతి గీతా బాలీ, "ముజిం" ప్రభృతి చిత్రాలు మూడు నాలుగింట నటిస్తోంది

* * *

ధ్రువతారల జాబితాలో చేరే నళినీజయవంత్ ఇటీవల నటించిన చిత్రాలు-"మిస్టర్ ఎక్స్," "పెరూ"లు రెండూ బాక్సాఫీస్ హిట్‌లు కావడంతో కొత్త చిత్రాలకు పిలుపులు ఎడతెగకుండా వస్తున్నాయి. ఆ రెండు చిత్రాలలోను ఆమె నాయకి అశోక్‌కుమార్ నాయకుడు ఇప్పుడు ఆమె పాల్గొంటున్న చిత్రాలు "మిస్ బాంబే" "బాంబే రేస్ కోర్స్."

పోతే, సేలంలో బి. ఎస్. శోభాక్ నిర్మిస్తున్న గేవా కలర్ చిత్రం "కిత్నా బదల్ గయా ఇన్‌సాన్"లో కూడా ఆమె ప్రముఖపాత్ర నిర్వహిస్తోంది ఇప్పు డామె సేలంలోనేఉంది ఆచిత్రంలో మద్రాసు నర్తకీమణులు పలువురు పాల్గొంటున్నారు అజిత్ నాయకుడు పల్లెటూరి యువకులు కొందరు బస్తీ వచ్చి, పెళ్ళి కూతుళ్ళను నిర్ణయించుకొని ఎత్తుకపోవడం

ప్రతిభావారి "దొంగలున్నారు జాగ్రత్త" లో చదలవాడ, గుమ్మడి

చిత్ర సమీక్ష:

# ఫిలింస్థాన్ వారి "చంపాకలి"



"అబ్ దిల్లీదూర్ నహీఁ" లో మోతీలాల్

ఫిలింస్థాన్ వారి గేవాకలర్ చిత్రం "చంపాకలి"లో రెండు లోపాలు కొట్టొచ్చినట్టు కనపడతాయి

మొదటిది మరీ బడాయి అనిపించే రంగు. రెండోది మరీ పాతది అయిన కథ

మనుషుల మేకప్ అంతా ఎర్రటి ఎరుపు. వారు ధరించిన వస్త్రాలన్నీ ఎరుపు వాళ్ళ వెనకాల తెరలూ, గోడలూ, ఇతర దృశ్యాలూ ఎరుపు.

ఇలా, కంటికి చెరుపు అనిపించేటంత అతిగా, ఎరుపు రంగును వాడారు.

కథ సృష్ట్యాదినాటినుండీ వింటున్నదీ కంటున్నదీను ఒక చిన్నవాడిని ఇద్దరు పడతులు ప్రేమించారు చివరి కొయిద్దరిలోను ఒకచిన్నది అతగాడికోసం ప్రాణాలను త్యాగంచేస్తుంది. అప్పుడు ఆ యువకుడూ, ఆ రెండో పిల్లా పెళ్లాడుతారు అదీ ఏర్పాటు.

ఈ చిత్రంలో అతిమనోహరంగా ఉన్నవి, కథానాయకి సుచిత్రాసేన్ వదనారవిందాన్ని చిత్రించిన క్లోజప్ దృశ్యాలు. మిగతా దృశ్యాలలో బొద్దుగాఉన్న ఆమె విగ్రహం, దానికితోడు గడ్డంకింద గడ్డం ఉండడం, కొంత ఎబ్బెట్టుగా ఉన్నాయి అలాగే, ఆ బెంగాలీ నటి హిందీ ఉచ్చారణ కూడా కొంతచెట్టుగా ఉన్నందువల్ల మొత్తం మీద ఈ చిత్రంలో ఆమె పాల్గొన్న భాగాలు ఏమంత బాగులేవనిపిస్తుంది

కాగా, 'చంపాకలి' గా నటించిన శుభాఖోటేవాటం, కొంత మొరటుగా ఉంది ఈ వేషానికి అవసరం అయిన మార్దవం లోపించింది శుభాఖోటే విగ్రహం, తరహా ఆ భూమికకు నప్పలేదు.

అలా పుచ్చుకున్న వేషానికి నప్పే విగ్రహం కలిగి, దాన్ని ఒప్పించే నటన ప్రదర్శించిన వ్యక్తి భరత్ భూషణ్



ప్రతిభావారి "జొంగలున్నారు జాగ్రత్త" లో చదలవాడ.



ఆర్ కె ఫిలింస్ వారి "అబ్ దిల్లీదూర్ నహీఁ" లో యాకూబ్

ఈ చిత్రానికి హేమంతకుమార్ కూర్చిన సంగీతం వింటూ ఉంటే, ఇదివరకు విన్న వరసల ఛాయలు లీలగాగుర్తుకొస్తాయి ఎటొచ్చీ ఆ వరసలు కూడా హేమంతకుమార్ వే. మొత్తంమీద, రెండు పాటలు చాలా హాయిగాఉన్నాయి 'హిట్'లు అనవచ్చు.

నృత్యాలలో, పశ్చిమ భారత సంప్రదాయాలను, సంస్కృతినీ ప్రతిబింబించే జానపద నృత్యం ఒకటి అత్యంత రమణీయంగా ఉంది

ఈ చిత్రం దర్శకుడు నందలాల్ జస్వంత్ లాల్.

(ఆంధ్రవారపత్రిక బొంబాయి విలేఖరి)



---

కథాంశం ఈ గాంధర్వ వివాహ గాథకు ఆధారం "సెవెన్ బ్రైడ్స్ ఫర్ సెవెన్ బ్రదర్స్" అనే అమెరికన్ (ఎం జి ఎం.) చిత్రం అని తెలుస్తోంది హాస్యరస ప్రధానంగా నడిచే ఈచిత్రం బాక్సాఫీస్ హిట్ కాగల సూచనలున్నాయంటున్నారు

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)

## చిత్రసమీక్ష:

# అంజలీవారి "సువర్ణసుందరి"

పెళ్లి, పెడాకులు, వారసులు, వారసత్వాలు వగైరాలకు సంబంధించిన న్యాయాన్యాయసూత్రాలను క్రోడీకరించడం అవసరం అని చాలామంది ఉద్ఘాటించేవారు పూర్వం. దరిమిలా హిందూకోడ్ బిల్లు రూపొంది పార్లమెంటు ఆమోదం పొంది స్థిరపడింది.

ఆలాగే భారతీయ చలనచిత్రాల బాక్సాఫీస్ సూత్రాలనుకూడా క్రోడీకరించి పడేయడం మంచిదని చాలామందికి లోగడ అనిపించింది. సదరు కార్యక్రమం సమగ్రంగా నెరవేర్చినవారు ఇంతవరకూ లేరు. ఒక్కొక్కరు కొన్నికొన్ని సూత్రాలను మాత్రమే సెల్యులాయిడ్ మీద భద్రపరచారు. హాలీవుడ్ తాలూకువీ, బొంబాయిలో దిగుమతి అయినవీ, అక్కడే ఉత్పత్తి అయినవీ, అక్కడనుండి వివిధ ప్రాంతాలకు రవాణా అయినవీ, ఆయా ప్రాంతాల 'సంస్కృతి' నీ బాక్సాఫీస్ హృదయాన్నీ మాత్రమే సూత్రించినవీ – ఇలా శతసహస్రాధిక సూత్రాలు చెల్లాచెదరుగా ఉన్నాయి. ముందు తరాలవారు ఓపట్టాన వాటిని అకట్టుకు రావడానికి అందుబాటులో లేకుండా ఒకొక్క చిత్రంలో కొన్ని, కొన్నిటిలో మరికొన్ని, అన్నిటిలో నూ కొన్నికొన్ని ఉంటున్నాయి. అన్ని ఉన్నవి కొన్నైనా లేవు.

ఈ దృష్ట్యా అంజలీపిక్చర్స్‌వారి "సువర్ణసుందరి" చిత్రాన్ని బాక్సాఫీస్ సూత్రాల పెద్దబాలశిక్ష అనవచ్చు; అలా అని. ఈ చిత్రాన్ని చూడవచ్చు ఈ సూత్రాల కూర్పులో దర్శక నిర్మాతలు చూపిన నేర్పును మెచ్చుకోనూవచ్చు. ఎందుకంటే మూడున్నర మైళ్లు పొడుగున్న ఈ చిత్రగాథలో నడుస్తున్నప్పుడు శ్రమ, విసుగు లేకుండా దారిలో బోలెడు మజిలీలున్నాయి. భారతీయ నృత్యాలు, బొంబాయిడాన్సులు, తెలుగు పాటలు, హిందీ గీత్‌లు, హాస్యం, దేశవాళీ రెడ్ ఇండియన్ కోయవాళ్లు, కొట్లాటలు, అట్టలబండలూ, వెదురుబుట్టలకొండలూ, ఇ. వి. సరోజ వేషంలో పార్వతీదేవి, ఇంకా సురలు, అసురలూ ఇత్యాదయః...

ఇవి కాక, కోడిగుడ్డూ గట్రా కురిపించే మాయా కమండలం, హాస్యరహస్యం అవగతం చేసుకున్నా ననుకున్న దండం (మనకి నవ్వొచ్చేలా అందర్నీ కొడుతుంది), జెట్ విమానం చప్పుడుతో గంటకి దాదాపు రెండు మూడు మైళ్ల వేగాన ఆకాశాన ఎగిరే దర్భాసనం, లేక కన్నె వచ్చి, కథానాయకుడిని చూచి "నువ్వు పగటిపూట రాజసులోచనగా తర్జుమా అయిపోనూ" అని మరొక బాక్సాఫీస్ శాపము లేక వరము ప్రసాదిస్తుంది.

ఇలాగే ఇంకా చాలా శాపాలున్నాయి. విశేషం ఏమిటంటే, వాటికి కథ అవసరాలు తెలుసు. అందుకే భార్య తాకిన మాత్రాన నాయకుడు శిలగా మారాలంటూ ఇంద్రుడిచ్చిన శాపం, చాలా తాపీగా—శాస్త్రోక్తంగా అమలు జరుగుతుంది. అది పూర్తి అయేలోగానే రక్షించమని నాయకీ, ఆమె కుమారుడూ శివపార్వతులను ప్రార్థిస్తూ పాటపాడుతారు. కాని కైలాసంలో వారిద్దరూ (రమణారావు, సరోజ) దాదాపు అదే పాటవరసకు, లయకు అనుగుణంగా నృత్యం చేస్తున్నారాయె; అందువల్ల ఇక్కడి పాటతోపాటే అక్కడి నృత్యం పూర్తికావాలి. అంతవరకూ దర్శనం ఇవ్వడం వీలుపడలేదు. వాళ్ళు దర్శనం ఇచ్చిన తరవాతకూడా ఇంకో చిత్రం ("సువర్ణపుష్పం లేక బంగారుపూవు") నిర్మించడానికి కావలసినంత కథగల మహాత్మ్యాన్ని ఆ చిన్నపిల్లాడికి ఒప్పగించి చక్కాపోతారు. ఆపిల్లవాడు మాయా తివాచీ ఎక్కి దేవలోకం వెళ్లాడు.

**కథ:** సదాశివబ్రహ్మం, ఆదిత్యన్ మాటలు: మల్లాది రామకృష్ణశాస్త్రి, పాటలు: సముద్రాల సీనియర్, జూనియర్, కొసరాజు, సంగీతం: ఆదినారాయణరావు, సహాయకుడు టి. వి. రాజు, నృత్యాలు: వెంపటి సత్యం, కళ: వాలి, మేకప్: హరిబాబు, ఛాయాగ్రహణం: ఎం. ఎ. రెహమాన్, శబ్దగ్రహణం: జె. సూర్యనారాయణ, ఎడిటింగ్: ఎన్. ఎస్. ప్రకాశం.

నటీనటులు: అంజలి, నాగేశ్వరరావు, రాజసులోచన, గిరిజ, సూర్యకళ, ఇ. వి. సరోజ, వసుంధర, మోహన, బాల, రేలంగి, గుమ్మడి, సి.ఎస్.ఆర్., రమణారెడ్డి, బాలకృష్ణ, పేకేటి, కె. వి. ఎస్. శర్మ, రాజారెడ్డి, మాస్టర్ బాబ్జీ, కోటేశ్వరరావు, లక్ష్మయ్య చౌదరి, ఎ. ఎల్. నారాయణ, రామచంద్రరావు, పసుపులేటి సత్యం, రెడ్డి, ఆచారి, రమణారావు, దర్శకుడు: వేదాంతం రాఘవయ్య, నిర్మాత: ఆదినారాయణరావు. ప్లేబాక్: జిక్కి, కోమల, సుశీల, ఘంటసాల, మాధవపెద్దిసత్యం. స్టిల్స్: సత్యం. స్టుడియో: వీనస్.

### 'బాక్సాఫీసూత్రాల బాలశిక్ష'

పట్టుకుచ్చుగల తివాచీలాటి చాప చాపతు శాస్త్రి, ఈ కథలో ప్రముఖ భూమికలు నిర్వహించాయి. (సదరు సామగ్రి శాండిల్య మహర్షి తాలూకుదని అభిశప్తుడగు నటుడొకడు చెప్పాడు. అతడు సగంవరకూ, "ఋషి-గడ్డం" ఉన్న మనిషీ; మిగతా సగం రబ్బరు కొండచిలువాను. పెద్ద గుహలో ఉంటాడు. అగ్నిగుండం, పొగా అవీ చూట్టానికి బాగున్నాయి.)

ఇవికాక, కథ కొంత అయేసరికి ఒహానాగ (కమండలం విరిగితే తనూ, దండమూ, పని చేయరాదని తెలిసినా కష్టాల్లో ఉన్న కథ అవసరాన్ని బట్టి ఆ తివాచీ పనిచేసి స్వామిభక్తిని ప్రదర్శించింది. తివాచీల స్వామిభక్తి గణనీయముగదా!)

అతడు వచ్చేలోగా, ఏ భాషారానివాడు జర్మన్ శాస్త్రీయ గ్రంథాన్ని గ్రహించి వ్యావహారిక భాషలోకి అనువదించేటంత వేగంతో కథానాయకుడు శిలగా తర్జుమా అవుతూ ఉంటాడు. సకాలంలో బంగారుపూవు వస్తుంది.

# అంజలీవారి "సువర్ణసుందరి"

కథ కంచికి వెళ్తుంది; ఐనా మనం ఇంటికి బయలేరకూడదు ఆ తరవాత గ్రూపుఫోటో ఉంది. ప్రేక్షకుల సందేహాలు కొన్నిటిని ఆ ఘట్టంలోనే నివృత్తి చేశారు.

ఈ విధంగా కాలక్షేపానికి నిక్షేపం అనవచ్చు. ఈ చిత్రంలో నటీనటవర్గం అంతా యథోచితంగా నటించారు "సువర్ణసుందరి" పాత్రకు రూపకల్పన, చిత్రణ, నటన, బాగున్నాయి. దిష్టితగలకుండా కాబోలు - ఒకచోటమటుకు బొంబాయి వాళ్ళ కాళ్ళ తరహానృత్యం చేయించి, దానికి, "గీతా రాయ్" పద్ధతిలో "బొమ్మలూ బొంమ్మలూ" ఫక్కీ "సంస్కృతిక" ఉచ్చారణతో పాటపాడించారు.

నాగేశ్వరరావు "ధరించిన" జయంతుడి పాత్రకు, 'జానపదకథా నాయకుడి చైతన్యం' ఉండవలసినంతగా లేదు. కొంతసేపు గళ్ళో కూచుని స్వర్గ ... చిన్నదానికోసం వెంగపెట్టుకోవడం, ఆతరవాత రాజకుమారి చన అయిపోడం జరిగింది.

శాపఫలితంగా జ్ఞాపకశక్తి పోయినందువల్ల భార్యను విడకే అవసరం తప్పిపోయింది.



బి. ఆర్. చోప్రాచిత్రం "నయాదౌర్"లో దిలీప్‌కుమార్, వైజయంతిమాల



కాగా, నీలాపనింద నెత్తినవేసుకుని ఇల్లు వదలివచ్చిన రాకుమారుడుగా, అతనికి ఉండవలసిన విధ్యుక్తధర్మపాలనా పరిజ్ఞానం కూడా, దర్శక, రచయితలశాపంవల్ల లేకుండా పోయింది అందువల్ల ఎవరో వచ్చి తోస్తేనో, ఏదో జరిగితేనో తప్ప, ఉన్నచోటు నుండికదలడు అలాగే కాలక్షేపంచేస్తాడు. ఈవిధంగా అసమగ్రంగా, అవకులు తిక్కవగా తయారైన ఈరకం పాత్రలు పోషించడానికి ప్రతిభ చూపనక్కరలేదు; ప్రభ చాలు ఐనా, నటుడునాగేశ్వరరావు, మోసపోసిన ఈ పాతవేషానికి ఐదు నిండు ప్రాణాలూ ప్రతిష్ఠించి, గొప్పగా ఒప్పించడానికి తన ప్రతిభనకూడా వినియోగించి దానిని రాణింపచేశాడు ఎన్నోకష్టాలు పడి పడి, భార్యబిడ్డలను కలుసుకొన్న క్షణంలోనే తిరిగి, తెలిసి తెలిసి వారికి దూరంఅయిపోతున్న వ్యక్తి ఆవేదనను, (చివరఉన్న కొద్ది సన్నివేశాలలోనూ) హృదయాన్ని కదలించేలా వ్యక్తంచేశాడు ఈ చిత్రం మొత్తంమీద ఆ అంశగల సన్నివేశాలు అవే.

(ఆంధ్రలో నాలుగోవారం నడుస్తున్న ఈ చిత్రాన్ని మొన్న 25 న పారగన్ టాకీసులో చూపించారు)



బసంత్ పిక్చర్స్‌వారి గేవాకలర్ చిత్రం "జింబో"లో వేషంవేయ వచ్చిన చింపంజీ 'పెడ్రో,' దాని శిక్షకులు న్యూఫీల్డ్ దంపతులు.

## అత్యద్భుత చిత్రం

ప్రముఖ ఫ్రెంచి దర్శకుడు, రచయిత, చిత్రకారుడు అయిన జాఁ కాక్టో, ఇటీవల "గౌతమ బుద్ధ" (భారత ఫిలింస్ డివిజన్ పనుపున బిమల్‌రాయ్ ప్రొడక్షన్స్ నిర్మించినది) చిత్రం చూచి "అత్యద్భుతమైనచిత్రం" అని ప్రశంసించాడు. ఈయన నిర్మించిన వర్ణచిత్రం "అండర్ సీ వరల్డ్" (జలచరాల జీవితాన్ని చిత్రించిన డాక్యుమెంటరీ) అమెరికన్ మోషన్ పిక్చర్ అకాడమీ అవార్డు అందుకోవడం విదితమే.

"గౌతమ బుద్ధ" చిత్రం కాన్స్ ఉత్సవంలో "స్పెషల్ మెన్షన్" అవార్డు అందుకొన్నది.



"దొంగలున్నారు జాగ్రత్త" చిత్రంలో బాలకృష్ణ, సి. ఎస్. ఆర్.

## పాత్ర: పాత్రత

(49-వ పేజీ తరువాయి)

స్థానం నిర్ణయించి, ఆ ప్రకారం దానికి సుస్పష్టమైన రూపురేఖలు ఇచ్చి ప్రాణం పోసి, మనుషులకు దానికీ పోలికలుండే ఏర్పాట్లు చెయ్యడం అసాధ్యం కాదు. కథ సాంఘికం అయినా, పౌరాణికం అయినా, జానపదం అయినా ఏదీ కాకపోయినా, ఆ ఉన్న కథలోని మనుషులను మనుషులుగా తీర్చిదిద్ది నడపడం అవసరం మన చిత్రాలలో అన్నీ బాగానే ఉంటున్నాయిగాని, ప్రధానపాత్రకే మోసం వస్తోంది వ్యక్తిత్వ దానికితగ్గ మాటలూ చేతలూ ఆద్యంతా చక్కగా ఉంటూ, అపశ్రుతులు లేకుండా నడచినా నాయకుడి భూమికలు గత రెండు మూడేళ్లలోను బహుతక్కువ అవాలి

ఇలా జరగడానికి, ఆయా నటీనటుల పార్‌వాల్యూ చాలులే అన్న ధీమా కారణం అనిపిస్తూంది. అదే నిజమైతే, అదేమంత గొప్పవిషయం కాదనికూడా అనిపిస్తుంది ★



### "భక్త రామదాసు"

జూలై నెలలో విడుదల చేయాలన్న సంకల్పంతో దర్శక నిర్మాత వి. నాగయ్య "రామదాసు" చిత్ర నిర్మాణం చురుకుగా సాగిస్తున్నారు. ఇప్పటికి తొమ్మిది రీళ్ల

# స్విస్ వాచీల ప్రదర్శనం

బాసెల్ నగరం (స్విట్జర్లాండ్)లో మొన్న ఏప్రిల్ 27 నుండి పదిరోజులపాటు, స్విస్ పారిశ్రామిక ప్రదర్శనం జరిగింది. దేశదేశాలనుండి ఆ ప్రదర్శనం చూడవచ్చిన కోటిమందినీ ఆకర్షించినది ఆ ప్రదర్శనంలోని వాచీల విభాగం. కాలాన్ని కొలిచే కళకు స్విట్జర్లాండ్ దేశీయులకు పెట్టింది పేరు "స్విస్ జ్యూయల్ లీవర్ వాచీ"ల ఉత్పత్తిదారులు ఈ ప్రదర్శనంలో ఏటేటా సరికొత్త మోస్తర్ల వాచీలను, ఎంతో పనివాడితనంతో కాలాన్ని ఖచ్చితంగా కొలిచిచూపేవాటిని అనేకం ప్రదర్శిస్తారు. ఎంతో చిన్నవి సున్నితమైనవి అయిన సహస్రాధికవిభాగాలు కూర్చిచేర్చిన ఈ వాచీలలో గాలి వత్తిడిశక్తి, వెలుతురు, శీతోష్ణాలమార్పులు మొదలైనవాటి ప్రభావంమీద తిరిగే గడియారాలు కూడా ఎన్నో రకాలవి ఉన్నాయి.

క్వార్ట్జ్ మీద పనిచేస్తూ 80 సంవత్సరాలకు ఒకే ఒక సెకండుకు మించి తేడారానంత ఖచ్చితంగా తిరిగే వాచీల తయారీకి ఆధారంగా మొదట రూపొందిన గడియారాన్ని ఇక్కడి ప్రదర్శనశాలలో ఉంచారు. ఇంతేగాక టెలిఫోను డయలంతవున్న ఎలక్ట్రానిక్ ట్రాన్‌సిటర్ గడియారాన్ని కూడా ప్రదర్శించారు. ఇది పరిశోధక ప్రతిరూపము.

విదేశాలనుండి కొనుక్కోటానికి వచ్చినవారు చాలామంది కొత్తవాచీ డిజైనులపైనే దృష్టిని మరల్చారు. ఎక్కువగా వానికవే కీ చుట్టుకొనే గుండ్రని వాచీలు చాలామందిని ఆకర్షించాయి. ఇవి వల్పని 'జెఫర్' తొడుగుల్లో ఇముడ్చబడ్డాయి. పారిస్‌లోని క్రొత్త ఫ్యాషన్ వర్గాలవారు విస్తారం "కాస్ట్యూమ్ జ్యూయలరీ వాచీ"లను అభినందించారు. పురుషులు ముఖ్యంగా క్యాలండరు వాచీలు, అలారపు చేతిగడియారాలను ఎన్నికచేసి మెచ్చుకున్నారు.

ఈ సంవత్సరం ప్రదర్శించిన గడియారాలలో అగ్రస్థానాన్ని పొందినవి!

పురుషులు ధరించే, చిన్న చేతి గడియారము. దీని డయలు మధ్య, ఒక చిన్న లైటు బల్బు ఉంది దీనివల్ల రాత్రిపూట డయలు స్పష్టంగా కన్పిస్తుంది ఇది ఒక చిన్న ఫ్లాష్ లైటులాకూడా ఉపయోగపడుతుంది. రెండవరకము అంధులకు అనువుగా తయారుచేసినది. దానంతటదే కీ చుట్టుకుంటుంది 'బ్రెయిలీ' అంకెలు (తడిమి స్పర్శవల్ల తెలుసుకొనేవి) ఉన్నాయి. మూడవది— "ఇగ్నిషన్ స్విచ్ టైమర్" ఇది మోటారెంతకాలం పార్కు చేశారో తెలియజేస్తుంది. క్రొత్త వస్తువులను చూడాలన్న అభిలాషగలవారికి, వీటిలో 600 అడుగుల లోతున ఒత్తిడిశక్తిని తట్టుకోగల వాచీలు, ప్రపంచంలో కల్లా ఎత్తయిన పర్వత శిఖరాలపై ఒత్తిడికి చెక్కు చెదరని వాచీలు, ట్రాపిక్స్‌నుండి, అంటార్కిటిక్‌ల మధ్యగల శీతోష్ణాలకు చెక్కుచెదరని వాచీలు, వీటిలో ఈదేటప్పుడు అనువుగా ఉండే గడియారాలు, వాటంతటవే కీ చుట్టుకునే గడియారాలు, చేతి అలారం గడియారాలు, రోలర్ బేరింగ్స్‌కు బదులుగా జ్యూయల్సు ఉపయోగింపబడి వాటంతటవే కీ చుట్టుకొనే గడియారాలు ఉన్నాయి. ఇంతేగాక వాటంతటవే తప్పును దిద్దుకొనగలుగు (పురుషులు ధరించేవి) వాచీలు చాలా ముఖ్యమైనవి. ★



ఆభరణంలో పొదిగినవాచి: ఈ స్విస్ జ్యూయల్ లీవరు వాచీలు అతి సున్నితమైనవి ఎంతమాత్రము బరువు లేకుండా – మీ శరీరంపైన ఎట్టి గుర్తులూ పడకుండా వీటిని మీరు ధరింపవచ్చును లేదా మీరు ధరించే దుస్తులకు తగిలించుకోవచ్చు. ఏప్రిల్ 27, మే 7 తేదీలమధ్య బాసెల్ స్విస్ వాచీల ప్రదర్శనంలో ఇవి ప్రదర్శింపబడ్డాయి. వాచీపైన ఉండే "బంగారపు అల్లికముడి" మాటున కనిపించనే కనిపించదు ఈ వాచి.

---

పూర్తిఅయ్యాయి. నాగయ్య, లింగమూర్తి, గౌరీనాథశాస్త్రి, ఎ వి సుబ్బారావు, రామన్నపంతులు, సి ఎస్ ఆర్, రమణారెడ్డి, పేకేటి, చదలవాడ, డా॥ శివరామకృష్ణయ్య, కన్నాంబ, సూర్యకుమారి, ఋష్యేంద్రమణి, మాస్టర్ నాగరాజ్ నటిస్తున్నారు. రచన యడవల్లి; పర్యవేక్షణ సముద్రాల. సంగీతం ఓగిరాల రామచంద్రరావు; పర్యవేక్షణ నాగయ్య ఛాయాగ్రహణం ప్రసాద్. కళ అమ్మయప్పన్. ★

గతవారం పత్రిక 51 వ పుట దిగువ భాగాన అచ్చుపడిన చిత్రం వివరణ సి ఎం త్రివేది నిర్మిస్తున్న 'లక్ష్మి'లో చంద్రశేఖర్, జేబీనందా.

# ★ విశ్వనాథుడు ★

(84-వ పేజీ తరువాయి)

జీవిని మరచిపోలేమన్నా మరవరాదన్నా అందనిఫలంకొరకు ఆశలు పొందడం అవివేకమని నిశ్చయించుకొని, కొంత కాలానికి విశ్వనాథుడు కాశీక్షేత్రానికి చేరుకున్నాడు.

కాశీలో విశ్వనాథుడు ధనాన్ని ఒకముసలవ్వకు యిచ్చి "అవ్వా! నాకు 'నా' అన్న దిక్కులేదు. ఈడబ్బు తీసుకొని, నాకు వండి పెట్టు! కన్న కొడుకులా చూసుకో! నీకు సేవచేస్తూ నీవద్దనే ఉండిపోతాను" అని చెప్పాడు.

అవ్వకుగూడ ఎవరూ దిక్కులేకపోవడం వల్ల అంగీకరించింది.

విశ్వనాథుడు నిత్యం గంగానదికి స్నానానికి వెళ్లేవాడు. స్నానంచేసి తల్లిదండ్రులకు చేయవలసిన ఉత్తరక్రియలు పిండప్రదానము మొదలైనపనులు పూర్తి చేసుకొని, అవ్వగూటికి చేరుకొనేవాడు.

విశ్వనాథుడు కాశీచేరి చాలాకాలం కావస్తోంది. అతను తన మృత్యుఘడియ ఎప్పుడు వస్తుందోనని లెక్కలుకట్టి చూసుకొనేవాడు. చివరకు ఆ దినం రానే వచ్చింది! ఆనాడే తన మృత్యువు అని గ్రహించాడు. తను చనిపోయినట్టు అవ్వకుగాని, యితరులకుగాని తెలియనివ్వకూడదనుకున్నాడు. అందుచేత చీకటితోనే లేచి, గంగాస్నానానికి బయలుదేరాడు. జనసంచారం లేనిచోటికి దూరంగా వెళ్లి అక్కడ గంగలో స్నానంచేశాడు. తిరిగివస్తూ 'అవ్వవద్దకు వెళ్ళడమా' లేక ఏ అరణ్యప్రాంతానికో పోవడమా!' అనుకుంటూ ఇసుకతిన్నె ఎక్కాడు! అంతే! అమాంతం వెనక్కి విరుచుకు పైనుంచి క్రిందికి దొర్లుకుంటూ పడిపోయాడు.

మూన్నాళ్లవరకు విశ్వనాథుని జాడ అవ్వకు అంతు చిక్కలేదు. కాశీ క్షేత్రమంతా గాలించింది! కాని లాభం లేకపోయింది. మూడవనాటి ఉదయాత్పూర్వమే సిద్ధుడొకడు గంగాస్నానానికి వచ్చాడు. అతను స్నానం చేసి తిరిగివెళ్ళేటప్పుడు సిద్ధుని పాదములకు విశ్వనాథుని మృతకళేబరం తగిలింది. సిద్ధుడాశ్చర్యపడి చూశాడు. అతడలా కొంత కడవు యోచించి, కమండలంలోని నీరుతీసి మంత్రించి విశ్వనాథునిపై జల్లాడు: వెంటనే విశ్వనాథుడు నిద్రమేల్కొన్నవాడిలా లేచి, ఎదుట నిల్చున్న సిద్ధునిచూసి చేతులు జోడించి "స్వామీ! మీరు తపశ్శక్తి సంపన్నులు కాబోలు! నన్ను మృత్యువునుంచి రక్షించారు. అదృష్టవంతుణ్ణి!" అన్నాడు.

సిద్ధుడు నవ్వి "నాయనా! ఇందులో నేనుచేసిన ఘనకార్యం ఏమీలేదు! నీవు అనుకుంటున్నట్టు నీవు మరణించలేదు. యోగసిద్ధి పొందావు. పూర్వజన్మ సుకృతులకు తప్ప అన్యులకు అది లభ్యంకాదు. నీవు సమాధి అవస్థలోవుండగా, నేను మేల్కొలిపాను. నేను రావట్లయితే నీవు అలా కృషించి నాశనమయ్యేవాడివి! ఇక నీకేమీ భయంలేదు. పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొని మహావ్యక్తివి కాగలవు!" అంటూ దీవించి సిద్ధుడు వెళ్లిపోయాడు.

విశ్వనాథుడు తిన్నగా అవ్వవద్దకు వచ్చాడు. అవ్వ ఆశ్చర్యంతో 'ఎక్కడికెళ్లావు?' అంటూ ప్రశ్నించింది.

విశ్వనాథుడు అవ్వకు ఏవో కుంటిసాకులు చెప్పి "అవ్వా! మా దేశం విడిచి వచ్చి చాలాకాలమయింది! నేనువెళ్లిపోతాను. నా డబ్బుతో సుఖంగా బ్రతుకు!" అన్నాడు.

అతను వెళ్లిపోవడానికి అవ్వ మొదట అంగీకరించలేదు. కాని చివరకు కన్నీళ్లతో విశ్వనాథుని ప్రయాణానికి అంగీకరించింది.

విశ్వనాథుడు కాశీనుంచి కుంభకోణం బయలుదేరాడు. దారిమధ్యలో ఒకసత్రంలో బసచేశాడు. అక్కడున్న కావలివాండ్రు శ్లోకాన్ని తెచ్చి విశ్వనాథునికి చూపించి 'అర్థం, సందర్భం, వివరించి చెప్పగలరా!' అంటూ ప్రశ్నించారు.

విశ్వనాథుడు శ్లోకాన్ని చూసాడు! పాతసంగతులన్నీ అతనికి జ్ఞాపకం వచ్చాయి! 'తనకిక ఏభయమూ లేదు! మహామంత్రికూడ తన నేంచేయలేడు. తను పూర్ణాయుష్కుడు! ఇదంతా రాజకుమారి ఏర్పాటు చేసివుంటుంది!' అనుకున్నాడు.

"అర్థం, సందర్భంకూడ వివరించి చెప్పగలను!" అన్నాడు. వెంటనే భటులు పల్లకీ తెప్పించి, అందులో, విశ్వనాథుని కూర్చోపెట్టి విజయనగరానికి బయలుదేరారు. ఈ వార్త ముందుగానే ఒక భటుడు వచ్చి, ఇందుమతీ దేవికి తెలియజేశాడు.

వెంటనే ఆమె, తండ్రివద్దకు వెళ్లి "నాన్నా! నా మౌనవ్రతం పూర్తి అయింది! ఇప్పుడు కాశీనుంచి ఒక మహానుభావుడు వస్తున్నాడు. అతను ఉండటానికి తగినఏర్పాట్లు చేయించండి!" అంటూ చెప్పింది.

కొన్నిదినాలకు విశ్వనాథుడు విజయనగరం చేరుకున్నాడు. అతను, మంచి బలిష్టంగా వున్నాడు. గడ్డంకూడ పెంచాడు. అతన్నిచూసి అంతా, నమస్కరించేవారు. ఇందుమతీదేవి విశ్వనాథుని దీక్షగా చూసింది. 'అవును! అతనే!' అనుకుని సంతృప్తి పడింది.

మరునాడు సభకు, విశ్వనాథుని తీసుకువెళ్లారు! విశ్వనాథుడు పవిత్రగంగాజలాన్ని సభికులకు పోయడానికి, కమండలం పుచ్చుకొని లేచాడు.

"మీ భార్యనైన నాకు, ఆకమండలాన్ని పట్టుకొనే భాగ్యం కలుగజేయండి!...మీరొక్కరే శ్రమపడలేరు" అంటూ ఇందుమతీదేవి సభలోనికి వచ్చింది. అంతా ఆశ్చర్యపోయారు. మహారాజు ఉగ్రుడయ్యాడు!

అప్పుడు ఇందుమతీదేవి గంభీరంగా "మహారాజా! ఇతనే నాభర్త!...ఇతన్నే అగ్నిసాక్షిగా వివాహమాడాను! కావలిస్తే ఇందులోగల మోసాన్ని, మంత్రిగారిని ప్రశ్నిస్తే చెప్పగలరు!" అన్నది.

అన్ని విషయాలు విపులంగా సభికులకు వినిపించింది. విశ్వనాథుడుకూడ తన వృత్తాంతం యావత్తు వివరించిచెప్పాడు.

మంత్రిని ప్రశ్నించగా నిజమేనన్నట్టు తన మోసకృత్యాన్ని ఒప్పుకున్నాడు.

"మంత్రిని కొరతవేయించండి!" అన్నాడు మహారాజు.

దానికి విశ్వనాథుడు అడ్డుపడ్డాడు!

"మంత్రిగారిని క్షమించండి! అతను నన్నొకసారి చంపకుండా కావలసినంత ధనమిచ్చి కాశీ పంపించారు! దానికి నేనెంతో కృతజ్ఞుణ్ణి! అతన్ని వదిలిపెట్టండి!" అన్నాడు.

ఆతరువాత మహారాజు విశ్వనాథుడికి పట్టాభిషేకం చేసి తను విశ్రాంతి తీసుకున్నాడు. విశ్వనాథుడు కుంభకోణం మనుషులను పంపించి తన తల్లిదండ్రులను రప్పించుకున్నాడు.

కుంభకోణాన్ని పాలించే రాజు రాజ్యభ్రష్టుడయ్యాడుకదా!...అతను విజయనగర సామ్రాజ్యానికి సామంతరాజు. అందువల్ల విశ్వనాథుడు ఆ రాజును పిలిపించి తిరిగి అతనిరాజ్యం అతనికి యిచ్చి "మీకు ఆనాడు, జ్యోతిషం చెప్పిన కుర్రవాణ్ణి నేనే! నాలుగుసంవత్సరముల అనంతరం, మీ రాజ్యం మీకువస్తుంది అని చెప్పాను! గుర్తుందా! మీ రాజ్యాన్ని మీరు ఏలుకోండి. మీరు కప్పంకట్టనవసరంలేదు." అని చెప్పాడు.

ఆ రాజు ఎంతో సంతోషించి, ఎన్నో బహుమానాలు కానుకగా యిచ్చి, రాజభక్తిని ప్రకటించాడు.

విశ్వనాథుడు ఇందుమతీదేవితో కలకాలం రాజ్యపాలనచేశాడు!... ★

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd, by S Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras 1 Editor S. Sambhu Prasad

Regd. No. M. 4479. Andhra Patrika Illustrated Weekl

# పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్‌ను వాడే

# ఆమె వెంట కనపడుటకు అతను గర్వపడతాడు

